188

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

మాసపత్రిక

## సంగీత కళాకారులను ఉద్దేశించి మావో ప్రసంగం

నిర్వహణ

'సాహితీమిత్రులు'

జూన్

1991

# సృజన

## ఆధునిక సాహిత్యవేదిక

188 మాసపత్రిక జూన్ 1991

ఈ సంచికలో....



నిర్వహణ

'సాహితీమిత్రులు'

సంవత్సర చందా రు. 40 ఈ సంచిక రు. 4

Edited, Printed and Published by P. Hemalatha, Flat 11, Block 2, MIG II, Baghlingampalli, Hyderabad-500 044 and Printed at Nagendra Press, Vijayawada-520 002

Working Editor : Vara Vara Rao

సంపాదకీయం :

# ఎన్నికల హింస తొలి సమీక్ష

ఎందుకంటే ఎన్నికల సమీక్ష చేయడానికి అసలవి ఎప్పుడు పూర్తవుతాయో శేషనూ చెప్పేట్లు లేడు. ఆదిశేషువూ చెప్పేట్లు లేడు. ఈలోగా ఎన్నికల నిచ్చెన లెక్క పావుల్ని పాములు మింగేస్తున్నాయి. ఈ పాము-నిచ్చెన ఆట ఎప్పుడు ముగిసేను. అందుకని ఎన్నికల సంరంభంలో ఆగనిదల్లా హింస గనుక అది చర్చించుకుందాం.

అసలింతకు జూన్ 8వ తేదీన పార్లమెంటు ఏర్పడకపోతే రాజ్యాంగ సంక్షోభం ఏర్పడుతుందన్న సంగతేమయింది ? అందుకోసమే కదా ముందు పెండల్ని, దేశ ఆర్థికస్థితిని లెక్కచేయకుండా ఆదరాబాదరాగా ఎన్నికల కార్యక్రమాన్ని తయారు చేసింది. జూన్ 8న పార్లమెంటు ఏర్పడకున్నా ఆ సంక్షోభం ఎట్లా తొలగిందో ఇపుడెవరూ చెప్పరే? ఒక మాజీ ప్రధాని చచ్చిపోయినందువల్ల ఏర్పడిన సంతాపం ఈ సంక్షోభాన్ని తొలగించగా రాజ్యాంగ యంత్రానికి అవసరమయిన అతి ముఖ్యమైన పనులు కూడా ఏమీ ఆగిపోయినట్లు కనిపించడంలేదు. హర్యానాలో రాష్ట్రపతి పాలన కొనసాగించడానికి రాజ్యసభ సమావేశమైతే సరిపోయింది. అదికూడా రాజీవ్‌గాంధీ మరణానికి అశ్రుతర్పణం చేసి, న్యాయవిచారణ పరిధిని విస్తృతపరచాలని చర్చించడానికి జరిగినట్లుగా వుందిగానీ హర్యానాలో కేంద్రం పాలన ఒక క్షణంలో మూజువాణీ ఓటుతో శాసనమైపోయింది. ఆపద్ధర్మ ప్రభుత్వం కాదుగదా, రాజ్యసభ కూడా ఆమోదించినా చెల్లని అతిముఖ్యమైన ఆర్థిక నిర్ణయాలు జరిగిపోతూనే వున్నాయి. బంగారాన్ని అంతర్జాతీయ విపణిలో అమ్మారు లేదా కుదువ బెట్టారు పెట్టక ఏం చేస్తారు డబ్బుకావాలి- పాలకవర్గాలన్నీ గుర్రపు పందాల్లో దిగాయి. రేసు రంజుగా సాగుతున్నది రాజాశ్వం కూలిపోయింది. పందెం తాత్కాలికంగా ఆగిపోయింది గానీ పందెపు గుర్రాలన్నీ మైదానంలోనే వున్నాయి. పైగా క్రీడల్లో క్రీడాకారులు మత్తు మందు తిన్నారని అర్హత కోల్పోతున్నట్లుగా ఏ ఎన్నికను శేషన్ ఎప్పుడు రద్దు చేస్తాడో!

పరిపాలనకు పరిపాలనకు అంతగా తేడాలేని ఈ నాలుగు పదుల నాలుగు పాదాల ధర్మవ్యవస్థకు ఇంతకాలం అశోక చక్రాన్ని తన పాదాలగోళ్ళ కింద అణచి

వుంచిన సింహానికి మూడు తలలు - పార్లమెంటు, సుప్రీంకోర్టు, శాసనాచరణ - అని అర్థం చెప్పుకుంటే ఇప్పుడు మాత్రం కేంద్ర మంత్రివర్గం కన్నా రాష్ట్రపతి, రాష్ట్రపతికన్నా ఎన్నికల ప్రధానాధికారి బలవంతులుగా కన్పిస్తున్నారు. కేంద్ర న్యాయ మంత్రి సుబ్రహ్మణ్యస్వామికి తప్ప అన్ని ఎన్నికల పార్టీలకు శేషన్ కొరకరాని కొయ్యగానే వున్నాడు. పాట్నాలోనూ, మీరట్‌లోనూ మరో చోటా ఎన్నికలు ఆయన మీద ఆధారపడి వున్నాయి తప్ప ఓటర్ల మీదకాదు. అట్లే పంజాబ్‌లో ఎన్నికలు అభ్యర్థు లొక్కొక్కరే హతులయి వాయిదా పడవలసిందే తప్ప, అన్ని ఎన్నికల పార్టీలు బహిష్కరించినా యథాప్రకారం జరుగుతాయనే అంటున్నాడు. ఎన్ని ఎన్నికలు రద్దుచేయదలుచుకున్నాడో, ఎన్నిచోట్ల రీపోలింగు పెట్టదలుచుకున్నాదో జిల్లా ఎన్నికల అధికారులకు కూడా తెలియదు. ఎందుకంటే విషయసేకరణకు ఆయన గూఢచారి సంస్థలమీద ఆధారపడుతున్నాడు.

త్రిపురలో సి.పి.ఐ.ఎం ఎన్నికలు బహిష్కరించనున్నది. పంజాబ్‌లో బిజెపి తప్ప అన్ని పార్టీలు ఎన్నికలు బహిష్కరిస్తున్నవి. తమ స్వప్రయోజనాల కోసం ఎన్నికలను బహిష్కరించడం పాపంకాదా అనుకుంటున్న పార్టీల ద్వంద్వ నీతికి వాళ్ళను వదిలేసి ఎన్నికల రొంపిలోకి దిగవద్దని ప్రజలను మనం ఎందుకు ఇనాళ్ళుగా కోరుతున్నామో అది భూమిపుండు మాత్రమేకాదు అది రక్తపు మడుగు అయిన వాస్తవంలో మనమీనాడున్నాం.

అధికార లెక్కల ప్రకారమే ఎన్నికల సందర్భంగా ఇప్పటికే మూడువందల మంది హతులయ్యారు. ఎన్నికలు ప్రశాంతంగా జరగాలంటే కేంద్రరిజర్వు దళాలను, స్పెషల్ స్ట్రైకింగ్ ఫోర్సులను, మిలటరీని ఉత్తర తెలంగాణా జిల్లాలకు పంపించాలంటు న్నాడు వెంకయ్యనాయుడు. అంటే ప్రజలెట్లాగూ ఓట్లు వేయరు గనుక వేయించడానికో వేయడానికో తగినంత సాయుధ బలగాలు కావాలన్నమాట. అస్సాంలో ప్రశాంతంగా ఎన్నికలు జరిగి ఏభై అయిదు శాతమైనా సరే ఓట్లు పడడంలో వున్న రహస్యమేమిటో దీనినిబట్టి తెలుసుకోవచ్చు. ఆంధ్రప్రదేశ్‌లో మొదటివిడత ఎన్నికలు జరిగిన నియోజక వర్గాల్లో, ముఖ్యంగా హైదరాబాద్ నగరంలో మధ్యాహ్నం ప్రాంతీయ వార్తలదాకా మందకొడిగా వున్న పోలింగు సాయంత్రానికి అరవైఅయిదో ఎనభైఅయిదో శాతానికి ఎట్లా పాకింది. ఈ ప్రహసనం కోసమే ఎన్నిచోట్ల పోలీసు కాల్పులు జరిగాయి!

ఆంధ్రప్రదేశ్‌లో ఈ ఎన్నికలు రెండు విషయాలను చాలా స్పష్టంగా ప్రజలు దృష్టికి తెస్తున్నాయి. విప్లవోద్యమం బలంగా వున్న ప్రాంతాల్లో ముఖ్యంగా ఉత్తర తెలంగాణా, ఉత్తరాంధ్రలలో ప్రజలు ఎన్నికలను బహిష్కరించదలచుకున్నారు. ఓటు వేస్తే చేయి నరికి వేస్తామని ఎవరో బెదరించడం వల్లకాదు—ఎందుకంటే ఓటు వేయకపోతే అంతు చూస్తామని గ్రామాల మీద దాడులుచేసి నెలల తరబడిగా పోలీసులు చిత్రహింసలు పెడుతూనే వున్నారు. విధ్వంస కార్యకలాపాలని సాగిస్తూనే వున్నారు. నిజానికి ఈ జిల్లాల్లో ఎన్నికలు బహిష్కరించమని పీపుల్స్‌వార్, ఓట్లు వేయాలని పోలీసులు చేస్తున్న ప్రచారం తప్ప ఎన్నికల పార్టీల ప్రచారం కనిపించడం లేదని పత్రికలు రోజూ రాస్తూనే వున్నాయి. ఇద్వారూ కరపత్రాలు పోస్టర్లు వేస్తున్నారు. గ్రామ గ్రామాన ప్రచారం చేస్తున్నారు. ఓటు వేయడం పవిత్ర హక్కని పోలీసులు చెప్తే, స్వచ్ఛందంగా బహిష్కరించే హక్కు కూడా ప్రజాస్వామిక మైందేనని పీపుల్స్‌వార్ చెప్తున్నది. బహిష్కరణకు బలవంతం చేస్తారనే నెపంతో బలవంతంగా ఓట్లు వేయించడానికి మొత్తం ఎన్నికల పార్టీలు, యంత్రాంగం, రాజ్యాంగ యంత్రం యుద్ధ ప్రాతిపదికన ఏర్పాట్లు చేస్తున్నది. దురదృష్టమల్లా ఏమిటంటే ఎన్నికలు ప్రజాస్వామికంగా జరగాలని కోరుకునే స్వచ్ఛంద ప్రజాస్వామిక శక్తులు, వ్యక్తులూ వాళ్ళ వనరూ, అవకాశాలు, శక్తి యుక్తులూ అన్నీ ప్రజలు నిర్భయంగా ఓటు వేయడానికి ప్రోత్సాహిస్తున్నాయే తప్ప—ఓటు వేయకుండా వుండాలని నిర్ణయించుకున్న ప్రజల అభీష్టాన్ని రాజ్యాంగ యంత్రం దాడి నుంచి పరిరక్షించాల్సిన బాధ్యత కూడా తమపై వుందని విస్మరిస్తున్నాయి.

ఓటు వేయడానికైనా, వేయకుండా వుండడానికైనా అది స్వచ్ఛందంగా జరుగుతుందా, బలవంతంగా జరుగుతుందా అని తేల్చుకోవడానికి పరీక్షాదినం పోలింగ్ తేదీయే. ఆ రోజు ప్రజాస్వామ్య వాచ్‌డాగ్‌లంతా ఓట్లేసే ప్రజాస్వామ్యం అమలుచేస్తారా—ఓట్లేయకుండా వుండడం కూడా ప్రజాస్వామ్యమే అనే అవగాహన స్వచ్ఛందంగా అమలయ్యే తీరు చూస్తారా అన్నది వేచి చూడాలి.

ఈలోగా పోలీసులు ఒక సంగతి తేల్చేసుకున్నారు. 1989 ఎన్నికల్లో సిరిసిల్లలోను, ఇల్లెందులోనూ ప్రజలు పోలీసుల ప్రచారానికి, సాయుధ బెదరింపులకు, దాడులకు లొంగరని, నిర్బంధంలో వాళ్ళు రాటుదేలారని, ఏ నిర్ణయమైనా సరే వాళ్ళ వాళ్ళ నిర్ణయాలు నిర్భయంగా అమలుచేస్తారని, అందుకే ఎన్నికలు ప్రక

టించగానే కరీంనగర్ జిల్లాలో సి పి ఐ ఎం ఎల్ (విమోచన) కార్యకర్తలను, సానుభూతిపరులను ఎన్‌కౌంటర్ పేరుతో కాల్చి చంపడం ప్రారంభించారు. ఇందులో రహస్యమూ లేదు. నమ్మచూపాలనే ప్రయత్నమూ లేదు. పట్టపగలు ప్రజల మధ్యనే పట్టుకొని కాల్చేస్తున్నారు. ప్రధాన స్రవంతిలోకి రావడమంటే నక్సలైట్లు ఎన్నికల్లో పాల్గొనడం కూడ కాదు—నూతన ప్రజాస్వామిక విప్లవ ప్రచారం చేయకపోవడం అని, ప్రజల్ని పాలక వర్గాలను ధిక్కరించే చైతన్యానికి సమాయత్తం చేయక పోవడం అని తేల్చి చెప్పదలచుకున్నారన్న మాట.

ఖమ్మంజిల్లా ఆదివాసులతో వెంగళరావుకు ఓటు వేయించలేకపోయిన పోలీసు యంత్రాంగం ఇపుడు మాజీ పోలీసు కార్యదర్శికి వాళ్ళు ఎట్లాగూ ఓటు వేయరు గనుక వాళ్ళను భయభ్రాంతుల్ని చేయడానికి కాచినపెల్లిలో ఐదుగురు 'ప్రజా పంథా' కార్యకర్తలను కాల్చివేశారు. వాళ్ళలో సీతాలక్ష్మి మండలాధ్యక్షురాలు. మరొకరు గ్రామ పంచాయితీ అధ్యక్షుడు కూడ.

'ఎన్‌కౌంటర్' హత్యలకు 'మిస్సింగు' హత్యలకు పేరుపడ్డ ఎన్టీఆర్ కూడ ఎన్నికల సమయంలో ఇన్ని ఎన్‌కౌంటర్ హత్యలు చేయలేదు. ఎంత దుర్మార్గ పరిపాలనా కాలంలో కూడా ఎన్నికల సమయం అంటే ప్రచారానికి కొంత ఊపిరి పీల్చుకునే అవకాశం దొరుకుతుందని ఎవరైనా ఆశిస్తారు. కాని జనార్దనరెడ్డి హయాంలో ఎన్నికల సమయంలో జరుగుతున్నంత రాజ్యాంగయంత్ర హింస ఇదివరికెన్నడూ లేదు. అంటే బూటకపు పార్లమెంటరీ ప్రజాస్వామ్యం విప్లవ ప్రజానీకాన్ని ఎదుర్కొనే క్రమంలో ఎన్నికల సమయంలో కూడా నటించే ఏమరపాటు కూడ చూప సాహసించలేక పోతున్నది.

ఈ నలభై ఏళ్ళకాలంలో మనం ఖద్దరు ఓట్ల ప్రజాస్వామ్యంనుంచి ఖాకీ ఓట్ల ప్రజాస్వామ్యంలోకి పయనించామని ఈ పదిహేనో తేదీతో తేలిపోతుంది—(రాజీవ్ గాంధీలు రిపీట్ కాకపోతే !)

కులం మతం సరేసరి. హింస ఎన్నికలకు పర్యాయ పదమయిందని, పాలక వర్గాలు అన్ని రూపాలలో ఆచరించే హింస ప్రత్యక్ష రూపంగాను బహిరంగంగానూ అమలుచేసే అధ్వాన్న కాలం ఎన్నికలని ప్రజలు గ్రహిస్తారు. ఈ హింస ముందు తాము ప్రకటించిన ప్రతిహింస రూపం ఎంత అహింసాత్మకమైందో ఊహించుకొని ఆశ్చర్యపోతారు.

10-6-91 —సంపాదకుడు

మంజీర కవితలు ఐదు

## నిషిద్ధ స్వప్నం

నేలను నిరంతరం స్పృశిస్తున్నాను
నింగిని, చందమామను
వెన్నెల చల్లదనాన్ని ఆస్వాదిస్తున్నాను
తూర్పుగాలి మోసుకొచ్చే
పొలాల వెచ్చదనాన్ని
మనసారా అందుకుంటున్నాను
నిన్నటిదాకా నాతో గుసగుసలాడి
నేడు నింగికెగసిన తారల్ని
అందువాకోలని
నిరంతర ప్రయత్నం చేస్తున్నాను
నిర్బంధంలో వుంటేనేం
ఆంక్షలకు అందని
నిషిద్ధ స్వప్నాన్ని
వీక్షిస్తూనే వున్నాను.



## ఆమె

ఆమె ఇన్నాళ్ళుగా
అతనినే నమ్మింది
ఇప్పుడు
అతనితో కలసి
విముక్తిని నమ్మింది.



## ప్రతిచర్య

ఊహించి నువ్వొకటి చేసావు
వ్యతిరేక ఫలితం చూసావు
దౌర్జన్యం నువ్వుచేసావు
ఐక్యత వాళ్ళు నేర్చారు
నిర్బంధించాననుకున్నావు
ప్రతిఘటనను నేర్పావు
విస్సిగ్గుగా కాల్చేసావు
ఆయుధావసరాన్ని గుర్తించారు
ప్రజలపై పగబట్టావు
ప్రభుత్వం మాది కాదని
రాజ్యాధికారం కోసం
తుపాకులందుకుంటున్నారు.



## మంచుకురిసినప్పుడు

మంచు కురిసినప్పుడు
మలినపడ్డ మల్లె తెల్లనవుతుంది
వాడిపోయిన మల్లె రాలిపోతుంది
ధాన్యం తూర్పార బట్టినపుడు
తాలుతప్పలు గాలికెగిరిపోతాయి
గట్టిగింజలు కుప్పపడ్తాయి.
నిర్బంధం పెచ్చరిల్లి
పార్టీ సంక్షోభంలో పడ్డపుడు
గుండెజారిన వాళ్ళు జారిపోతారు
ధైర్యాన్ని దీపం చేసుకున్న వాళ్ళు
గమ్యం చేర్తారు.



## తోటకెలాచెప్పను ?

మనిద్దరం కలసి నడచిన
ఆ తోట దృశ్యంలోకి
నేను ఒంటరిగా అడుగుపెట్టాను
అనాడు మనకు
పరిమళం పంచిన పూలు
గతం గుర్తుచేస్తూ
నీ సుగంధాన్ని వెదజల్లాయి
కొమ్మలపై ఊయలలూగుతూ
ఆకుల వేణువులపై, గాలి
నీ పాటలే పాడింది
నీ ఆచూకి అడిగింది
ఆ తోటకెలా చెప్పను
అమరత్వ శిఖరాల మీద
ఆకాశం పూతోటలో నువ్వు
అరుణ పుష్పాని వైనావని.

[ఒక ఊరి ప్రజలు కా ॥ స్వర్ణ పాటను గుర్తుచేసినపుడు]

## చేనేత చెల్లి

రుద్రజ్వాల

జాకార్డు తళతళ మెరిసేట్టు
సగం సత్తువ ధారవోసినా
పట్టపగలు గూడా పొద్దుగుంకిన బతుకునేత నీదే చెల్లీ!
పాంచెక్కాల తాడు కాలికి కట్టుకున్నట్టు
పనికి పనికి నేస్తున్నట్టు ఒక్కటే పరుగు!
చీపిరిలా సంజకసువూ, చీకటి చిమ్ముతూనే
చిరచిర్లాడుతూ మగడు కేకేస్తేవాలు....

నాడీలాగుంట ఊకుక్క పురుకుతావు.
ఇంటిపనీ, పిల్లలపనీ చుడ్తూనే
చిక్కుపడినపోగు సరిచూస్తావు.

పుదయం నుంచి పొయ్యిలా మండి మోసిన వంట బరువు
ప్రతి కంచానికీ రుచులతో నింపి
ప్లేట్లూ, గ్లాసులూ, గిన్నెలు, కంచాలూ కడిగి
అట్ల నడుమెత్తి మధ్యాహ్నం అగిన మగ్గాన్ని, కునికే భర్తని, కుంటుతున్న
అదాయాన్ని చూచి

తిండి అఖపు తీరకుండానే తాడు బరువు తొక్కటానికి
మగ్గం మీది కెక్కుతావు

సాయంత్రమౌతుకాగానే షికారు చొక్కా తొడుక్కొని చేసుకున్నోడు బైటికి
పోతే....

ఏ తాగుడు, పేకాటకు బానిసయ్యాడో,
ఏ అరుగు ముచ్చట్లకతుక్కు పోయాడో,
ఏ పెక్కు సినిమా ట్రిక్కులకు చిక్కుకు పొయ్యాడో అరాతెల్సి
ఎంత గుబగుబలాడిపొయ్యావో
కొట్టుకు లాడిన కండెకుతెల్సు
కదలిన గుడ్డకు తెల్సు
గుడ్డమీది బొమ్మకు తెల్సు.
ఒంటరి నీ పూర్పుకు తెల్సు.
అన్నీ చూసిన అర్ధరాత్రి అశ్రుపాతానికి అంతాతెల్సు.

పండగడాపుడి తరుముకొస్తే....
మూపున నూలుకొండ మోస్తున్నంత పనిభారం!
ఇల్లలికి ముగ్గులు పెట్టిన కాడ్నుంచి
ఇసురిసురుగా బండెడింటి చాకిరి
ఒక్కతెవే వగరుస్తూ చేసినా........
మెలకువెప్పుడొస్తే అప్పుడు రాత్రి మగ్గమై ఆడినా.......

మెప్పులేదు, గుర్తింపులేదు, అయ్యో పాపమన్న ఆర్ద్రత లేదు
తాను టిఫినికి, టీనీళ్ళకుపోయి
గంటలు వృథా కొట్టినా ఫర్వాలేదు గని
నీవల్ల ఏ క్షణ అవసరానికి ఆలస్యం జరిగినా........
పురుష పెత్తనం చిందులు నిన్ను నిలదీస్తాయి.
ప్రశ్నల గద్దింపులు నిన్ను చుట్టుముడ్తాయి.
దినదినం పేదదేరని యిబ్బందులు పోల్చుకోని
ఎంటీల తాకట్టుకూ, చీట్లపాటకూ, పెరిగినప్పులకూ కారణమడిగితే........
పట్టిచ్చెలా చూసుకుంటాడనుకున్న పెనిమిటే
చిరుతపులిలా దూకి తన్నులు, గుద్దులతో నిన్ను హింసిస్తాడు
తెగిన నక్కిలా నిన్ను తోసేస్తాడు.
పసిబిడ్డల ప్రేమబంధం పిలిచినట్టు
ద్వారబంధం పట్టుకు నిలచిన నీ తల్లితనానికి ఎన్ని కష్టాలు తల్లీ!
ఎక్కడైనా ఏం సుఖపడ్డావ్?
మనిషి తగ్గితే మగ్గం కాలి కుంచుకుపోతుందని
ఎన్నేళ్ళకు పెళ్ళి చేసాడు తండ్రి!
బాలింతవైనా ఎంత భంగపరచాడు భర్త?
జాకార్డు పీసుగా
దేశదేశాల టేబుల్ క్లాతుగా మెరిసిన నీకు
ఈ దేశం ఏం మిగిల్చింది
ఆకలి చీకటీ, ఆందోళనా, అభద్రత తప్ప?
కాలు గడప దాటకపోయినా
మెట్టినింట్లో, పుట్టినింట్లో
నాల్గు గోడల కటకటాల, గుడిసెల పంజరాన లోలోపల
గిజగిజలాడిన ప్రాణమున్న పనిముట్టు జీవితమేగా నీది!
దీన్ని ఏ సెగల పొగల సాలెగూళ్ళ కాలానికి తగిలిస్తావ్?
ఏ అంతరంగ సంక్షోభానికి అతుకేస్తావ్?

కథ :

# గేట్వురాయి

డి. మురళీధర్

మద్రాసు నుండి ఢిల్లీ వెళ్ళే జి.టి. ఎక్స్‌ప్రెసు రైలుకు టికెట్టు ఇల్లయ్యింది. అంతదాకా స్తబ్దంగా ఉన్న స్టేషన్ సందడితో నిండిపోయింది. స్టేషన్‌ముందు సిటీ బస్సులు ఆగి వున్నాయి. ప్రయాణీకుల కోసం ఆటోలు పోటీపడి స్టేషన్‌కేసి వస్తు న్నాయి. ఉదయం ఏడు గంటలు. బొగ్గుపొగల మధ్య సూర్యుడు పోలీసుల మధ్య ఖైదీలా చిక్కుపడిపోయాడు.

"చీచేవాలా - చీచేవాలా - మీఠావాలా" పండ్లవాళ్ళ కేకలు. పల్లీలమ్మేవాడు, పూలమ్మేవాడు అందరి ముఖాలు పరిశీలిస్తూ జనం మధ్య తిరుగుతున్నారు. దారికి రెండు ప్రక్కలా పొగచూరిన మురికి హోటల్లల్లో నుండి తెలుగు, హిందీ కలివిడిగా సినిమా పాటలు. మంగలిషాపు పక్క చేలాలో వేలాడదీసిన వార్తాపత్రికలు. మధ్యలో పత్రికలమ్మే పిల్లవాడి కీచుగొంతు కేక.

---

నల్లమల అడవులు దాటి, గూడాలు దాటి, పుల్లల చెరువు దాటి, ఎర్రగొండ
పాలెం దాటి, ఎర్రబడ్డ బాటలు దాటి,
నగరాలకు రావా సారాబందని ఎన్ని ఎదురుచూపులు చూశావ్ ?
నిరాశకు కొట్టుకుపోకు
నువ్వో నిప్పుల వంతెనగా పుద్యమించు.
నీ మగని మత్తు పారిపోతుంది.
నీ కలత దిబ్బ కరిగిపోతుంది.
బార్లుగా, దుకాణాలుగా
పొంచి పొంచి తొలుస్తున్న షావుకార్ల పాలన
సారా ట్యూబులాగే పేలిపోతుంది.
నీకూ, నీభర్తకూ నీలాంటి వారికందరికీ చేతికందని శ్రమ
నిండు జాబిల్లిగా చేరువవుతుంది.
నీ వునికి యీ దేశ భాషకు కంఠహారమవుతుంది చెల్లీ!

ఈ రణగొణ ధ్వనుల మధ్య రాజశేఖర్ లూనా బండిని నడిపించలేకపోయాడు. అతనికి అన్నీ భయమే - అన్నీ శంకలే - అతని వెనక కూర్చున్న అతని తమ్ముడు తిరుపతి అన్నకు పూర్తి వ్యతిరేక స్వభావం.

"బాగో....బాగో...." మంగలి షాపుముందు పేపరు చదివే యువకులను పోలీసులు తరిమారు. పోలీసులు జనాన్ని కసురుకుంటూ, బూట్లు కిర్ కిర్ మంటుండగా హడావిడిగా తిరుగుతున్నారు.

"అబ్బ! ఎక్కడ చూసినా పోలీసులే. నాకు ఇక్కడికొస్తే హిట్లర్ రెండవ ప్రపంచ యుద్ధం కనిపిస్తున్నదన్నా!" తిరుపతి.

"నువ్వు నోరు మూసుకోరా! ఇది మీ 'చాందా'కాదు". రాజశేఖర్ లూనా ఆపి.

"ఏ పూరైతేంది—ఇట్లనే ఉంటే 'అన్న'కు ఖిందుకట్టినట్టే"

"ఎక్కడ ఎవన్ని ఎవడు చంపాడో? మన చుట్టు ప్రతి వలుగురికి ఒకడు 'ఐడీ' పార్టీ వాడున్నాడు తెల్సా" రాజశేఖర్ తమ్ముని కేసి వంగి గుసగుసగా-

"ఉంటే ఉండనియ్యే? మాట్లాడుడే బందుపెడ్తరా?" తిరుపతి విసుక్కున్నాడు.

"తొందరగా టికెట్టు తెచ్చుకపో....నేను లూనా స్టాండుల పెట్టివస్త" రాజశేఖర్ ఆ ప్రస్తావన తప్పించే ఉద్దేశంతో....

తిరుపతి మందిలో కలిసిపోయాడు.

"నమస్తే మామ" రాజశేఖర్‌కు కుడిచేయి వైపునగల గోడవైపు నుండి పిలుపు విన్పించింది.

రాజశేఖర్ పోలీసుల మూడ్‌లో ఉన్నాడు కనుక ఉలిక్కిపడ్డాడు. బిత్తరపోయి అటుకేసి చూశాడు.

"ఇటు మామ.... నేను శివరాములును" సన్నగా పీలగా గడకర్రలాగా అంతెత్తు గల వ్యక్తి పండ్ల బండి అవతలనుంచి అన్నాడు.

రాజశేఖర్‌కు పసుపు పచ్చగా పండి ఉన్న రెండు అరటిగెలల మధ్య నల్లగా శివరాములు ముఖం కన్పించింది....శివరాములు రాజశేఖర్ ఊరివాడే. పైగా ఒకే కులం కనుక ఏదో వరుస.

"ఇదీ ఒకందుకు మంచిదే. స్కూటర్ స్టాండులో లూనా పెడితే వాడికి అనవసరంగా రూపాయి యివ్వాలె". రాజశేఖర్ మనసులో అనుకొని లూనాను నెట్టుతూ శివరాములు పండ్ల బండిదాకా నడిచాడు.

"ఏందిర శివయ్య ఇక్కడ తేలినవ్ - పోనీ ఇంటికన్నా రావచ్చుగదా! ఊళ్ళో సంగతులేంది? మా వోళ్ళంత మంచిగున్నరు గదా!" రాజశేఖర్ లానాకు స్టాండు వేస్తూ.........

"సిన్న మామకు, నీకు ఉద్యోగాలు దొరికి ఈవలబడితిరి. మీకు ఎరుక లేనిదే మున్నది? చేతికి మూతికి అందని బతుకేనాయె. ఊళ్ళెఆళ్ళ సొమ్ము దోసుకపోయినట్టు తన్నులు గుద్దులు—ఇయ్యేడు నోట్లెకచ్చిన వంట గొడ్లమేపిచ్చిండ్లు—ఊళ్ళె క్యాంపు బెట్టిండ్లు—ఏదో కొన్ని దినాలు యాడికి కొట్టుకొచ్చిన". శివరాములు పండ్లు టకాటకా ప్యాకు చేస్తూనే చెప్పుకపోతున్నాడు. అతని వాలకం చూస్తే కడుపులో చాలా కష్టం దాచుకున్నవానిలాగే ఉన్నాడు.

"సరే సరే ఇప్పుడవన్ని వొద్దు—మళ్ళెప్పుడన్నా తీరిగ్గా మాట్లాడుకుందాం చూస్తున్నావ్ కదా! స్టేషనంతా మామలు నిండిపోయిండ్లు" రాజశేఖర్ అని "స్వంతమా పండ్ల బండి" అన్నాడు యదాలాపంగా.

"కాదు, ఈ పండ్ల సేట్ మా బావకు తెలుసు. భోజనంబెట్టి నెలకు నూటయాభై యిస్తానన్నాడు....లాభం, నష్టం అతనివే"—శివరాములు.

"సరే సరే! నాకు క్రేను దగ్గర పనున్నది- ఈ బండి చూడు" రాజశేఖర్ జనంలో కలిసి స్టేషన్ కేసి నడిచాడు.

శివరాములు మాసిన బట్టలు, చెప్పుల్లేని కాళ్ళు, పీక్కుపోయిన దవడలు, రాజశేఖర్ మనస్సులో ఎక్కడో కలుక్కుమనిపించాయి.

తన బతుకు అట్లాగే ఉండేది, సరైన సమయంలో నిలదొక్కుకొని ఒక రేవుకు తేలాడు. లేకపోతే ఈ పాటికి ఎన్‌కౌంటరో, జైలో, లేకపోతే వనవాసమో తప్పేవికావు.... చదువుకొనే రోజులు, ఆ ఉత్సాహంలో, ఆ వయసులో ఏమీ తెలియవు- వొట్టి బొక్కలకు కోంగ్రిగాడు దెబ్బలు తిన్నట్టు రానిదానికి పోనిదానికి బతుకు నాశనం.... తనప్పుడు ఆ నిర్ణయం తీసుకోవడం బాగైయింది' రాజశేఖర్ చేదు జ్ఞాపకాలను వొదిలించుకుంటూ స్టేషన్ చేరుకున్నాడు.

తిరుపతి ఎవరో ఒక స్త్రీ చేతికి డబ్బు యిచ్చి సునాయాసంగా టికెట్టు తెప్పించుకున్నాడు.

"రా అన్న- లేటయ్యింది" తిరుపతి.

"ప్లాట్‌ఫాం టికెట్టు తీసుకున్నావా?" రాజశేఖర్.

"నీకన్నీ భయాలే—" తిరుపతి.

రాజశేఖర్ అదేమి పట్టించుకోకుండా "మనూరి శివరాములు కల్సిండురా" అన్నాడు.

"ఎవలు సుద్దపెల్లి చంద్రయ్య బావకొడుకా?"

"ఔను వాడే మనబోటోల్లంత వెళ్ళి వచ్చిన తరువాత వాళ్ళే పొలిటిక్సు నడుపు తండ్లు- పొలిటిక్సుతో పాడైపోయి నెలకు నూటయాభైకి పండ్లు అమ్ముతున్నడు".

"మనమూ తిరిగిన వాళ్ళమే. నిలవడ్డోడు ఉరికెటోన్ని ఎక్కిరిచ్చిండంటం మనకు చాతకాదు. ఇంకొకలు ఆ పని చెయ్యొద్దు.... అది సరేగాని శివరాములు నిన్ను గుర్తు పట్టిండా?".

"గుర్తుపట్టక పోవడమేమిటారా ? దెబ్భైఎనిమిది సంవత్సరాల షావుకారి కింద గిర్విబడ్డ వాళ్ళ భూమిని నేనేకదా గెట్టుమీదుండి దున్నిచ్చిండి. వాడు అయిదారుగురిని వెంటేసుకొచ్చి నన్ను, చంద్రయ్యబావను, అప్పుడు పన్నెండేండ్లనుకుంట శివ రాములను ఇయ్యరమయ్య కొట్టలేదా ? ఆ తరువాత ఊరేగింపు గొడవ చూస్తే శివరాముల పుర్రెపగిలి నెత్తురు గలుసుకట్టింది.

అదేలొల్లిల సైకిలుమీద తాలూకాకు తీసకపోయి కుట్లేయించి కట్టుకట్టించి మందులు కొనుక్కొని నడిజాము వరకు ఇంటికొచ్చిన".

"అప్పటి రోజులట్లాంటివి....ఇప్పుడో నీడను చూస్తే నీకు భయం ఎంతైనా ఎద్దుముడ్డి పొడుసుక బతికెటోల్లం—మనం ఈ లెవల్లో ఉన్నమంటే ఉద్యమమే కదా!" తిరుపతి అన్నాడు. తిరుపతి చందాలో ఒక కంపెనీలో ఎలక్ట్రిషన్....

"ఆఁ మనస్వశక్తి...." రాజశేఖర్ పెదవులు చప్పరించాడు తిరుపతి ముఖంలో అన్నమీద కలిగిన ఈసడింపు భావం రాజశేఖర్ చూడలేదు. ధనధనలాడుతూ ట్రేనొచ్చింది. తిరుపతి మందిని తోసుకుంటూ వెళ్లి ఎదురుగ గల రిజర్వు కంపార్టు మెంటులోనికి ఎక్కాడు.

"మొత్తానికి వీడెక్కడైనా బతుకగలడు. తనకైతే రిజర్వు కంపార్టుమెంటును చూస్తేనే కాళ్లు వణుకుతాయి. అంతెందుకు ప్లాటుఫాం టికెట్టులేదని బయటే ఉండి పోయాడు. ఒకప్పటి చొరవ ఏమయిపోయింది. అప్పుడైతే"—రాజశేఖర్‌కు ఈ ఆలోచనలకే భయమయ్యింది.

ఒక్కసారి మేల్కొన్నవానిలాగా చూశాడు....ట్రేన్ దిగిన జనప్రవాహం

నానా రకాల మాటలతో చప్పుళ్లతో తోసుకొచ్చింది. స్టేషన్ ముందు ఆటోలవాళ్లు హారన్లు మోగిస్తూ నవారి గురించి అడుగుతున్నారు.

ఎర్రగా, ఎత్తుగా ఉన్నవాళ్లు, బూరెబుగ్గలవాళ్లు, జీవితంలో ఏ చీకు, చింత లేనట్లున్న వాళ్లే ఆ రైలునుండి ఎక్కువ మంది దిగారు....ఒకలు అరా పీక్కుపోయిన ముఖాలు గల వాళ్లన్నారు.

ఎప్పుడొచ్చి ఆగిందోగాని పోలీసుల జీపొచ్చి ఆగింది....జీబులోనుండి నల్లగా కుడిమట్రంగా ఉన్న సర్కిల్ దిగాడు. పోలీసులు హడావిడి పడిపోయి ఆటోలను దూరంగా తరిమారు.

ట్రేనులో నుండి దిగిన వాళ్లల్లో బూరెబుగ్గల వాళ్లనొదిలి పీక్కుపోయిన ముఖాల వాళ్లను అనుమానంగా చూస్తున్నారు. ఈ రైల్లోనే ఘరానా నేరస్తుడెవరో వస్తున్నట్లున్నాయి వాళ్ల చూపులు....

"ఏయ్ మిస్టర్"....సర్కిల్ ఇన్స్పెక్టరు ఎవరినోపిలిచాడు.

రాజశేఖర్ టక్కున ఆగిపోయాడు.

కాని సర్కిల్ పిలిచింది రాజశేఖర్ పక్కనున్నతన్ని....

ఒక పోలీసు పరుగెత్తుకొచ్చి రాజశేఖర్ పక్కతని చేతుల్లోని అట్టాడబ్బాను జబర్దస్తీగా తెరిచి "సార్ తెల్లకాయిదాలు" అన్నాడు.

"ఆ కాగితాలెక్కడివి ?" సర్కిల్

"కొనుక్కొస్తున్న సార్ ...." అతను

"ఎందుకు కరపత్రాలకా ?" సర్కిల్....

పోలీసులు ధన్మని అతని చెంపమీద ఒక దెబ్బ కొట్టాడు.

"అరె! నన్నెందుకు కొడుతండ్లు—నేను శ్రీ వెంకటేశ్వర ప్రెస్ల పనిచేస్త. మా సేఠ్ తెమ్మంటె తెస్తున్న" అతను లబోదిబోమన్నాడు.

సర్కిల్ అవమానంగా ఇంకో దిక్కు ముఖం తిప్పుకొని వెళ్లిపోయాడు. "తెరిమాకా—ముందే చెప్పద్దుబే! పో—కనిపించకుండా పో" పోలీసు గద్దించాడు.

రాజశేఖర్కు ముచ్చెమటలు పోశాయి. గబగబ నడిచి శివరాములు పండ్ల బండి దగ్గరకు చేరుకున్నాడు.

"ఎందుకనో గావరగావర వస్తుండ్లు మామ" శివరాములు.

"ఏంలేదు స్టేషన్ ముందు పోలీసులు చెక్ చేస్తుండ్లు".

"చెయ్యనియ్యండ్లి, దొంగలుపడ్డ అర్నెల్లకు....మన దగ్గరేమున్నయి ?" శివరాములు చిన్నగా నవ్వుతూ....

"ఏం పిలగా అరటిపండ్లు ఎట్లమ్ముతున్నవ్ ?" నల్లగా జిడ్డోడుతూ వున్న ఒక బొగ్గుగని కార్మికుడు అడిగాడు. రాత్రి డ్యూటీనుండి వస్తున్నట్లున్నది. నెత్తిమీద బొక్కటోపీ....

"ఆ–చీచేవాలా–తింటె తియ్యగా–" శివరాములు బండి చుట్టు తిరిగి ఓ మురిగిపోయిన అరటిపండు తీసి పారేసి, మరొకటి జాలిగా అడిగిన ఒక పిల్లవాడి కిచ్చాడు.

"వినేన్నిర–తమ్మి–పండ్లమ్ముతవా ? దానధర్మాలు సేస్తవా ?"

"వస్తున్న–వస్తన్నసార్! జెర పొద్దాలనాయ్–దుకాణం సదురుకోవద్దా ? అటుచూడు పోలీసోల్లు, అచ్చేపోయెటోల్లు సదురుకుంటలేరా ? ఆఁ ఎన్నియ్యాలె– బయట నాలుగు రూపాయలకు డజను. నీకైతే మూడున్నర." శివరాములు డజను అరటిపండ్లు గెలనుండి కోశాడు.

"ఏంనాకే ఎందుకట్ల ? మా యిల్లు పక్క నీ యిల్లా ? ఏమన్నసుట్టానివా ?" కార్మికుడు తెల్లని పండ్లు బయటపడే లాగున నవ్వి సైకిలు దిగి పండ్ల బండి దగ్గర కొచ్చి–టోపి అంగూర పండ్ల దగ్గర పడేసిండు. శివరాములు చేతిలోని పండ్లు ఒకటొకటే వంకలు పెడుతూ అటిటు, ముడుతూ మాట్లాడాడు కార్మికుడు.

శివరాములు పండ్లు ప్యాకుచేసి "ఇక అందరు గిట్ల ఏరుకపోతేమేమెట్ల బతుకాలెనన్న–" పండ్లు బండికిందికి వంగి కాగితాలు తీసి జాగ్రత్తగా చుట్టాడు.

"అదేమి కట్టుడు, సైకిలుమీద పెట్టుకుంట మంచిగ ప్యాకుచేయి" కార్మికుడు మరో పేపరు వేసి కట్టాడు. కార్మికుడు వెనుక సీటుమీద పండ్లుపెట్టుకొని సైకి లెక్కాడు.

"టోపి మర్సిపోయినవన్న" శివరాములు టోపి తీసుకపోయి యిచ్చాడు. కార్మికుడిచ్చిన పైసలు తీసుకున్నాడు.

అటునుండి ముగ్గురు పోలీసులు పండ్ల దుకాణాలను "దూరం జరుపండ"ని హెచ్చరిస్తూ వెళ్లిపోయారు.

"గిరాకి పొద్దునగదా!" శివరాములు నొచ్చుకున్నాడు.

"పర్వలేదు" రాజశేఖర్ లూనా తీసుకుపోయాడు. సీటుమీద అంతా దుమ్ము

పేరుకపోయింది. శివరాములు పండ్ల బండికింద భాగంలో గల బారుగు డబ్బాలో గుడ్డపేగులు కనిపిస్తున్నాయి. రాజశేఖర్ ఒక గుడ్డపేగు తీసుకోబోయాడు.

"నేను దూడుస్త గద మామ" శివరాములు గుడ్డలేసి లూనా దులిపాడు. "అత్తా, పిల్లలు అంతా బాగానే కదా" శివరాములు.

"ఆఁ" అన్నాడు రాజశేఖర్ పొడిగా- తొందరగా అక్కడినుండి బయట పడాలని రాజశేఖరుకున్నది.

శివరాములుకేమొ ఇంకా 'లోతైనవి' చాలా విషయాలు అడుగాలని ఉన్నది. "ఎక్కడ బతుక వశమైత లేదు మామ. ఏడ చూసిన లఫంగలే ఎవరిని నమ్మకుంటో చ్చింది. చెట్టుపేరు చెప్పుకొని కాయలమ్ముకునేటోల్లు జమయ్యిండ్లు- మన బతుకు మనం ఏ అంటు సొంటు లేకుంట బతుకుదామన్న వశపడకుంటున్నది" శివరాములు జనాంతికంగా అని- ఓరగా రాజశేఖర్ ముఖంలోకి చూసి- "ఆఁ ఇగో ముసలవ్వ. గియ్యి రెండున్నరకు డజను- అంగూర రాత్రేదిగింది హాల్- కిలో అయిదు రూపాయలు- అంగూరలేందుంటం అవ్వ- డజను అరటిపండ్లిస్త కొంటబో" బండి ముందు నిలుచున్న ముసలవ్వకు అరటి పండ్లు పొట్లం కట్టియిచ్చి పావుల తక్కు-వున్నయంటే "సర్ పో" అన్నాడు. అట్లాగే ఇంకో డజను అరటి పండ్లు ప్యాకు చేసి తెచ్చి రాజశేఖర్ లూనా పక్కన గల రేకు డబ్బాలో వేశాడు.

రాజశేఖర్‌కు ఒక సంగతి గుర్తొచ్చింది. తను ఉద్యోగంలో చేరిన కొత్తలో అప్పట్లో తన దగ్గరికి వచ్చే మనిషికోసం శివరాములు కొరియర్‌గా ఉత్తరం తెచ్చాడు. అవ్వన్నీ శివరాములుకు గుర్తున్నయా? గుర్తులేకుంటేనే మంచిది. "వద్దు శివరాములు.... పోనీ ఇగోడబ్బు" రాజశేఖర్ జేబులోనుండి అయిదు రూపాయల నోటు తీసి పట్టుకున్నాడు.

"వద్దు- డజను అరటిపండ్లే కదా! పిల్లలుతింటరు".

"నువ్వు నూటయాభై రూపాయలకు నెలంత కష్టపడాలె- ఈ డజను పండ్లకు ఈ రోజు జీతం టుప్పా"

శివరాములు రాజశేఖర్ కళ్ళల్లోకి చూశాడు.

"గానుగలది గంటెడే కది మామ- సేఠ్ చూడచ్చిండా ? లెక్కబెట్టి యిచ్చిండా?" శివరాములు.

రాజశేఖర్ అయిదు రూపాయలనోటు జేబులో వేసుకొని లూనా స్టార్టు చేసుకొని వెళ్ళిపోయాడు.

తను ఎప్పుడో చేసిన సహాయాన్ని శివరాములు ఇంకా మరిచిపోలేదు. కృతజ్ఞత చూపుతున్నాడు. పాపం శివరాములు లాంటి అమాయకులు ఎవరిని పడితే వాళ్ళనే నమ్ముతారు. అందరిని ఇట్లాగే నమ్మి మోసపోతున్నారు. నాడు తెలంగాణా పోరాటమప్పుడు నాయకత్వాన్ని నమ్మారు. ఆనాడు నాయకత్వం జనాన్ని తుపాకుల ముందుకు తోలి తోక ముడిచారు. మొన్న శ్రీకాకుళము అంతే కాలేదా? ఎవరినంటే ఏమున్నది? ప్రజలు మూర్ఖులు. ప్రతిదాన్ని నమ్మి వెంటబడి ఉరికి వాడు మోసం చేయగానే కూలబడతరు. శివరాములు పిచ్చోడు కాకపోతే మరేమిటి? తన నింకా సానుభూతిపరుడే అనుకుంటున్నాడు. మారే ఈ దేశంలో విప్లవం కల్ల ....పాపం శివరాములు లాంటి వాళ్ళు ఎన్నడు బాగుపడుతరో ? — రాజశేఖర్ తన మనసులో అనుకున్నాడు.

అక్కడ శివరాములు ముఖం మబ్బు కప్పింది. కొసేపటికి పెదవులమీద చిరునవ్వు మెరిసింది. "ఇంకానయం. కింది డబ్బాలల్లో చెయ్యిపెట్టనియ్యలేదు. బొగ్గు బాయిల అన్నకిచ్చిన అరటిపండ్లకు చుట్టిన పత్రికలు, కరపత్రాలు గుర్తుపట్టిండా ? టోపిలోనుండి ఉత్తరం తియడం చూశాడా? మారే అంత తెలివితేటలు లేనట్లున్నది. ఉద్యోగంలో- అదీ చెముటెల్లని ఉద్యోగంలో చేరితే అంతేననుకుంట. తను- తన కుటుంబం- స్వార్థం పెరుగలేదనుకుంట. తను సేల్ కండ్లు గప్పి పండ్లు యిస్తున్నానంటే నడీ లేదు నప్పుడులేదు అయిదు రూపాయలు జేబులో పెట్టుకపోయిండు. అన్నలు "దొంగతనాన్ని" వద్దంటరు. అన్నిటికన్న ముఖ్యంగా ఎవరైనా ఎట్ల విచారం చేస్తండ్లు అన్నది చూస్తరు. తన పరీక్ష పనికొచ్చింది. మామ మనోడు గాదు మందోడే-" శివరాములు అంచనా కట్టాడు.

శివరాములు 'న్యాపారం' సాగుతూనే ఉన్నది. మరేదో రైలు రాబోతోంది. జన ప్రవాహం పెరిగిపోతూనే ఉన్నది. పోలీసులు వచ్చేవాళ్ళను పోయేవాళ్ళను అనుమానంగా చూస్తూనే ఉన్నారు.

o o o

ప్రసంగ వ్యాసం :

# సంగీతరంగ కళాకారులను ఉద్దేశించి కామ్రేడ్ మావో ప్రసంగం :

## (1956, ఆగస్టు 24)

ప్రపంచంలోని అన్ని దేశాల కళ, మౌలిక సూత్రాలకు సంబంధించినంత వరకు ఒకే విధంగా వుంటుంది. అయితే రూపం, శైలి అనే విషయాలలో విభిన్నంగా వుంటుంది. వివిధ సోషలిస్టు దేశాల కళ విషయానికి వస్తే, ప్రతీదానికీ, సోషలిజమే సారాంశంగా వుంది. కానీ ప్రతీదానికి, దాని స్వీయ జాతీయ స్వభావం వుంటుంది. వాటికి పోలికలు, తేడాలు, సామాన్య లక్షణాలు, విశిష్ట లక్షణాలు వుంటాయి. ఇది ఒక సహజ నియమం. విషయాలన్నీ అవి ప్రకృతికి సంబంధించినవైనా, సమాజానికి సంబంధించినవైనా లేదా మేధోపరిధిలోకి వచ్చేవైనా, విషయాలన్నీ కూడా ఇలానే వుంటాయి. ఒక చెట్టు ఆకులనే ఉదాహరణగా తీసుకోండి. పైకి ఆకులన్నీ ఒక్కతీరునే వున్నట్టుగానే కనబడతాయి. కానీ మీరు వాటిని జాగ్రత్తగా పరిశీలిస్తే ప్రతి ఆకు విభిన్నంగా వుంటుంది. ఏ మాత్రం తేడాలేని రెండు ఆకులను కనుగొనడం అన్నది అసాధ్యం.

వర్గపోరాటం, సామాజిక విప్లవం, పెట్టుబడిదారీ విధానం నుండి సోషలిజానికి పరివర్తన - ఈ విషయాలకు అన్ని దేశాలలోనూ ఒకే మౌలిక సూత్రాలుంటాయి. కానీ, ప్రధాన సూత్రాలపై ఆధారపడి వుండే లఘు (మైనర్) సూత్రాలు, పరిణామాలు (మేనిఫెస్టేషన్స్) విషయంలో ప్రతీ దేశం భిన్నంగా వుంటుంది. అక్టోబరు విప్లవం, చైనా విప్లవం, ఈ విధంగానే ఉన్నాయి. ఆ రెండు విప్లవాలు మౌలిక సూత్రాలకు సంబంధించినంతవరకు ఒకే తీరులోనే ఉన్నాయి. అయితే ఈ సూత్రాలు వ్యక్తమయిన రూపం విషయానికి వస్తే, రెండు విప్లవాలకు అనేక తేడాలున్నాయి. ఉదాహరణకు, రష్యాలో విప్లవం నగరాలనుండి గ్రామీణ ప్రాంతాలకు అభివృద్ధి చెందగా, మనదేశంలో అది గ్రామీణ ప్రాంతాలనుండి నగరాలకు అభివృద్ధి చెందింది. ఈ రెండు విప్లవాల మధ్య గల అనేక తేడాలలో ఇది ఒకటి.

ప్రపంచంలోని వివిధ దేశాల కళల విషయంలో ప్రతీదానికి, తన స్వీయ, విశిష్ట జాతీయ రూపమూ, జాతీయ శైలి వున్నాయి. కొందరు ఈ విషయాన్ని అర్థం చేసుకోరు. పాశ్చాత్య దేశాలు, అన్ని విషయాలలోనూ మిక్కిలి శ్రేష్టమైనవని భావిస్తూ వారు, తమ స్వంత జాతీయ విశిష్ట లక్షణాలను తిరస్కరిస్తారు. పాశ్చాత్య దేశాలను గుడ్డిగా ఆరాధిస్తారు. వారు కడకు "సంపూర్ణ పాశ్చాత్యీకరణ"ను ప్రబోధించేంత దూరం కూడా వెడతారు. ఇది తప్పు. 'సంపూర్ణ పాశ్చాత్యీకరణ' అనేది ఆచరణ సాధ్యమైనదికాదు. చైనా జనసామాన్యం దాన్ని ఆమోదించరు. కళలకు, ప్రకృతి శాస్త్రానికి ఈ విషయంలో తేడా వుంది. ఉదాహరణకు, ఎపెండిక్స్‌ను తొలగించడం, ఆస్ప్రో మాత్రను వేసుకోవడం అనే విషయాలకు జాతీయ రూపం ఏదీలేదు. కళల విషయం అలా కాదు. వాటి విషయంలో జాతీయ రూపం అనే సమస్య తప్పకుండా ఉత్పన్నమవుతుంది. ఎందుచేతనంటె, కళ అనేది ప్రజల జీవనం, ఆలోచనలు, అనుభూతులు అనే వాటి తాలుకు వ్యక్తీకరణే. దానికి ఒక జాతి సాంప్రదాయాలు, భాషలతో చాలా సన్నిహితమైన సంబంధమే ఉంటుంది. కళావారసత్వం, చారిత్రకంగా జాతి చట్రం లోపల్నే అభివృద్ధి చెందింది.

చైనీయ కళ, చైనీయ సంగీతం, చిత్రలేఖనం, నాటకం, పాట, నృత్యం, సాహిత్యం వీటన్నింటిలోనూ ప్రతీదానికి దాని స్వీయ చారిత్రకాభివృద్ధి ఉంది. సంపూర్ణ పాశ్చాత్యీకరణను ప్రబోధించేవారు, చైనీయ విషయాలను తిరస్కరించడానికి గాను, చైనీయ విషయాలకు వాటి స్వంత సూత్రాలు లేవని అంటారు. కనుక, వారు వాటిని అధ్యయనం చేయడానికి గాని, లేదా అభివృద్ధి చేయడానికి గాని ఇష్టపడటం లేదు. ఇది చైనీయ కళపట్ల జాతీయ నిహిలిజం వైఖరిని అవలంబించడమే.

ప్రపంచంలోని ప్రతి దేశానికి, దాని స్వంత బలమైన అంశాలూ, బలహీన అంశాలు ఉంటాయి. చక్కటి వస్తువులు, చెత్తాచెదారం, అనాదినుండికూడా కలగలిసే ఉన్నాయి. సుదీర్ఘ కాలంలో పోగులుపడ్డాయి. వాటిని జల్లెడ పట్టి, నెల్లును, పొల్లును వేరుచేసి, అసలు వాన్ని గుర్తించడం అనేది చాలా క్లిష్టమైన పనే. అయితే, ఈ ఇబ్బంది కారణంగా మనం చరిత్రను తోసిపుచ్చకూడదు. చరిత్రతో తెగతెంపులు చేసుకోవడం, మన జాతి వారసత్వానికి తిలోదకాలనివ్వడం మంచిది కాదు. జనసామాన్యం దాన్ని ఆమోదించరు.

అయితే, మనం విదేశాలనుండి నేర్చుకోవాల్సిన అవసరమేది లేదని చెప్పడం

లేదు. మనం తప్పకుండా అనేక విషయాలను విదేశాల నుండి నేర్చుకోవాలి. వాటిని కరతలామలకం చేసుకోవాలి. మనం ప్రత్యేకించి మౌలిక సిద్ధాంతాన్ని కరతలామలకం చేసుకోవాలి. "మూల విషయంగా చైనీయ విజ్ఞానము, వాస్తవాన్వయానికి పాశ్చాత్య విజ్ఞానం" అనే దాన్ని కొందరు ప్రబోధిస్తున్నారు. ఈ అభిప్రాయం తప్పా, ఒప్పా? అది తప్పు 'విజ్ఞానం' అనే పదం వాస్తవంలో, మౌలిక సిద్ధాంతాన్ని సూచిస్తుంది. మౌలిక సిద్ధాంతం చైనాలోనూ, విదేశాలలోను కూడా ఒకేవిధంగా ఉండాలి. మౌలిక సిద్ధాంతంలో, చైనీయ విషయాలకూ, పాశ్చాత్య విషయాలకూ మధ్య ఏ తేడా ఉండకూడదు.

మార్క్సిజం, పాశ్చాత్య దేశాలలో ఉత్పత్తి చేయబడ్డ ఒక మౌలిక సిద్ధాంతం. ఈ విషయంలో చైనీయమైనదేది, పాశ్చాత్య దేశాలకు సంబంధించినదేదీ అనే విభజనను మనం ఎలా చేయగలం? మనం మార్క్సిజాన్ని స్వీకరించకుండా నిరాకరించాలా? మార్క్సిజాన్ని స్వీకరించకపోతే, మనకు కీడు జరుగుతుందని చైనా విప్లవాచరణ రుజువు చేస్తోంది. దాన్ని స్వీకరించకపోవడం అసమంజసం. గతంలో సెకండ్ ఇంటర్నేషనల్ మార్క్సిజపు మూల సిద్ధాంతాలను నిరాకరించి, సవరించ ప్రయత్నించింది. అందుకుగాను కొన్ని వాదనలను ముందుకు తెచ్చింది. అయితే, లెనిన్ వాటిని పూర్తిగా పూర్వపక్షం చేశారు. మార్క్సిజం, విశ్వజనీనంగా అన్వయించే ఒక సాధారణ సత్యం. దాన్ని మనం తప్పక స్వీకరించాలి. అయితే, ఈ సాధారణ సత్యాన్ని ప్రతి ఒక్క దేశ విప్లవం తాలూకు నిర్దిష్ట ఆచరణతో తప్పని సరిగా మేళనం చేయాలి. చైనా ప్రజలు మార్క్సిజాన్ని స్వీకరించి, దాన్ని చైనా విప్లవాచరణతో మేళవించారు కనుకనే, వారు చైనా విప్లవంలో విజయం సాధించారు.

చైనీయ విషయాలను అధ్యయనం చేసి, అభివృద్ధి చేయాలని కోరుకుంటున్నాం కనుకనే మనం విదేశీయ విషయాలను నేర్చుకుంటాం. ప్రకృతి శాస్త్రాలు, సామాజిక శాస్త్రాలు ఈ విషయంలో ఒకే విధంగానే ఉంటాయి. మనం విదేశాలలోని మంచి విషయాలనన్నింటినీ తప్పనిసరిగా కరతలామలకం చేసుకోవాలి, అనంతరం వాటిని అన్వయించి, ఆ క్రమంలో వాటిని అభివృద్ధి చేయాలి. ప్రకృతి శాస్త్రాల రంగంలో మనం మన స్వీయమైన సృజనాత్మక కృషిచేయాలి. మన స్వంత ఆలోచనా విధానాలను మనం ఏర్పరచుకోగలిగేదాకా, చైనీయ శాస్త్రీయ వారసత్వాన్నుండి నెల్లును, పొల్లును వేరుచేయడానికై మనం విదేశాలలోని ఆధునిక శాస్త్రీయ

విజ్ఞానాన్ని, పద్ధతులను వాడుకోవాలి. పాశ్చాత్య వైద్య శాస్త్రాన్ని, ఫిజియాలజీ, పాథాలజీ, బయోకెమిస్ట్రీ, బాక్టీరియాలజీ, ఎనాటమీ వంటి తత్సంబంధితమైన ఆధునిక శాస్త్రాలను ఉదాహరణగా తీసుకోండి. వాటిని మనం అధ్యయనం చేయదల్చడం లేదు అని మీరనగలరా? మనం ఈ ఆధునిక శాస్త్రాలన్నింటినీ అధ్యయనం చేయాలి. అయితే, పాశ్చాత్య వైద్య విజ్ఞాన శాస్త్రాన్ని అభ్యసించిన వారిలో కొందరు చైనీయ వైద్య ప్రక్రియను కూడా అధ్యయనం చేయాలి. మన ప్రాచీన చైనీయ వైద్య పద్ధతులను, పరికరాలను క్రమబద్ధం చేసి, అధ్యయనం చేయడానికి తమ ఆధునిక శాస్త్రీయ విజ్ఞానాన్ని ఉపయోగించాలి. అంతేకాక, నూతనమైన, ఏకీకృతమైన చైనీయ వైద్య, ఔషధ విజ్ఞాన శాస్త్రాలను సృష్టించడానికై వారు చైనీయ, పాశ్చాత్య వైద్య, ఔషధ విజ్ఞాన శాస్త్రాలను మేళవించాలి.

ఈ సూత్రం ప్రకృతి, సామాజిక శాస్త్రాలు రెంటికి వర్తిస్తుంది ఇక అపుడు కళలకు అది ఇంకెంతగా వర్తించాలి? మనం తప్పకుండా విదేశాలనుండి నేర్చుకోవాలి, విదేశాలలోని మంచి విషయాలను స్వీకరించాలి, కానీ మనం వాటిని నేర్చుకొన్న తర్వాత, చైనాలోని వివిధ ప్రజారాశుల కళలను అధ్యయనంచేసి అభివృద్ధి, చేయడానికి వాటిని ఉపయోగించాలి అలా కాకపోతే మన కృషి నిష్ప్రయోజనకరమైనదవుతుంది. తన స్వంతమైన విశిష్ట జాతీయ రూపాలను శైలులను సంతరించుకొన్నవైనట్టి చైనాలోని వివిధ ప్రజారాశుల తాలుకు, ఒక కొత్త సోషలిస్టు కళను సృష్టించడం అన్నదే, విదేశీ కళలను అధ్యయనం చేయడం, వాటి మౌలిక సిద్ధాంతాలు, సాంకేతిక మెళకువలనూ అధ్యయనం చేయడంలోని మన ఉద్దేశం

ఆధునిక సంస్కృతి విషయంలో, పాశ్చాత్య ప్రమాణాలు, మనవాటికన్నా చాలా పై స్థాయిలోనే వున్నాయని మనం వొప్పుకుని తీరాలి. మనం వెనకబడిపోయాం. కళల విషయంకూడా ఈలాగునే వుందా? కళలలో, మనకు బలమైన అంశాలూ వున్నాయి, బలహీనాంశాలు వున్నాయి. మన లోటుపాట్లను చక్కబెట్టుకోడానికై, విదేశాలలోని మంచి విషయాలను స్వీకరించడంలో మనం నేర్పు చూపాలి. మనం మన పాతపద్ధతులకే అంటి పెట్టుకొని వుండిపోయి, విదేశీ సాహిత్యాన్ని అధ్యయనం చేయక, దాన్ని చైనాలో ప్రవేశపెట్టకపోతే, విదేశీ సంగీతాన్ని ఎలా వినాలి, ఎలా ప్రదర్శించాలి అనేది మనకు తెలియకపోతే అది మంచిదికాదు. విదేశీ విషయాలన్నింటినీ తిరస్కరించిన విధవరాలు చక్రవర్తిణి ట్జు-షి లా మనం

ఎన్నటికీ ప్రవర్తించరాదు. విదేశీ విషయాలను గుడ్డిగా తిరస్కరించడం, వాటిని గుడ్డిగా పూజించడం వంటిదే. రెండు తప్పుడివే, హానికరమైనవే.

విదేశాలనుండి నేర్చుకునేటపుడు, యథాతథవాదం, పిడివాదం అనే ఈ రెంటినీ మనం తప్పని సరిగా వ్యతిరేకించాలి. మనం పిడివాదం మూలంగా ఇప్పటికే రాజకీయంగా దెబ్బతిన్నాం. విదేశాలనుండి మనం కాపీ చేసుకొన్న ప్రతిదీ, తు.చ. తప్పకుండా అన్వయించబడింది. ఇది పెద్ద వోటమికి దారితీసింది. తెల్లప్రాంతాలలోని పార్టీ సంస్థలు తమబలాన్ని నూటికి నూరుపాళ్ళు కోల్పోయాయి. విప్లవ స్థావర ప్రాంతాలు, ఎర్రసైన్యము తమ బలంతో 90 శాతం వరకు కోల్పోయాయి. విప్లవ విజయం అనేక సంవత్సరాలు ఆలస్యమయింది. కొందరు కామ్రేడ్స్ వాస్తవికత నుండి కాక, పిడివాదంనుండి ప్రారంభమయారు అన్నదే దీనికి అసలు కారణం. వారు మార్క్సిజం—లెనినిజం మౌలిక సిద్ధాంతాన్ని చైనా విప్లవపు నిర్దిష్ట ఆచరణతో మేళనం చేయలేదు. మనం ఈ రకం పిడివాదాన్ని తిరస్కరించి వుండక పోయినట్లయితే, చైనా విప్లవం ఈనాటి విజయాన్ని సాధించి వుండేదేకాదు.

కళల రంగంలో మనం ఈ గుణపాఠాన్నికూడా నేర్చుకోవాలి, పిడివాదం మననెత్తిమీద స్వారీచేయకుండా చాలా జాగ్రత్త వహించాలి. విదేశ విషయాలను అధ్యయనం చేయడం అంటె, సమస్తాన్ని ఏకమొత్తంగా దిగుమతి చేసుకోడం అనికాదు. మనం విమర్శనాత్మకంగానే విషయాలను స్వీకరించాలి. నేటి ప్రజారాశులకు ప్రయోజనం చేకూర్చేందుకే మనం పూర్వీకుల నుండి నేర్చుకొంటాం; చైనా ప్రజలకు ప్రయోజనం చేకూర్చేందుకే మనం విదేశీయులనుండి నేర్చుకొంటాం.

"మనం తప్పనిసరిగా విదేశాలలోని మంచి విషయాలను నేర్చుకోవాలి. చైనా లోని మంచి విషయాలను కూడా మనం నేర్చుకోవాలి. వెనిగర్ సగందాకానే వున్న సీసాలు ఎందుకూ పనికిరావు, సగందాకా వెనిగర్ వున్న రెండు సీసాలను, మనం రెండు నిండు సీసాలుగా మార్చాలి. చైనీయ, విదేశీయ విషయాలు రెండింటినీ మనం కరతలామలకం చేసుకోవాలి, వాటిని ఒకే దేహంగా సమ్మేళనం చేయాలి. లూషన్ ఈ పనిచేశారు. ఆయనకు, చైనీయ, విదేశీయ రచనలు, రెంటిలోనూ బాగా ప్రవేశం వుంది. ఆయన ప్రతిభ, ప్రధానంగా ఆయన సృజనాత్మక రచనలతోనే ఉంది తప్ప, అనువాదాలలో కాదు. ఆయన సృజనాత్మక కృషి విదేశీవాటి లాగానూ లేదు, లేదా పాతతరహా చైనా వాటిలాగాను లేదు, అయినప్పటికి అది చైనీయ

మైనదే. మనం లూషన్ చైతన్యాన్ని అధ్యయనం చేయాలి. చైనీయ, విదేశీయ విషయాలు రెంటిని కరతలామలకం చేసుకోవాలి. చైనీయ, విదేశీయ కళలలోని మంచి అంశాలను స్వీకరించాలి. వాటిని రెంటిని కలిపి, పోతపోసి, విలక్షణంగా కనబడే, జాతీయ రూపం, శైలివున్న ఒక కొత్త 'కళ'ను సృష్టించాలి.

చైనీయ, విదేశీయ విషయాలను, విజయవంతంగా మేళవం చేయడం అంత తేలిక కాదు అన్నదీ నిజమే. అది కొంత వ్యవధి పట్టే ఒక క్రమం. విదేశీ విషయాలను సమ్మిళితం చేయడం సాధ్యమయ్యే చైనీయ విషయాలు కొన్ని ఉన్నాయి. ఉదాహరణకు నవలలు రాసేటపుడు, భాష, పాత్రలు, నేపథ్యం తప్పకుండా చైనీయమైనవిగానే వుండాలి. కానీ, వాటిని చైనీయ 'ధారావాహిక భాగాల' రూపంలో రాయనవసరం లేదు. చైనీయం, విదేశీయం ఈ రెండింటిలో ఏదీ కానటువంటి వాటిని కొన్నింటిని మీరు సృష్టించవచ్చు. బైటకొచ్చినది గుర్రమూకాక, గాడిదాకాక, కంచర గాడిదైతే మునిగిపోయిన దేమీలేదు. రెండు విషయాలు సమ్మిళితమైనపుడు వాటి రూపం మారుతుంది. పూర్తిగా మార్పులేకుండానే వుండిపోవడం వాటికి సాధ్యం కాదు. చైనీయ విషయాలు మారుతాయి. చైనా స్వరూపం రాజకీయంగా, ఆర్థికంగా, సాంస్కృతికంగా పెను మార్పులకు లోనవుతోంది. అయితే, అవి ఎంతగా మారినా గానీ, చైనీయ విషయాలకు ఎల్లప్పుడూ వాటి స్వీయ విశిష్ట లక్షణాలు వుంటాయి. విదేశీ విషయాలు కూడా మారతాయి. అక్టోబరు విప్లవానంతరం ప్రపంచ స్వరూపం ఒక మౌలికమైన మార్పుకు లోనయింది ఈ మార్పు రెండవ ప్రపంచ యుద్ధానంతరం ఒక కొత్త దిశలో అభివృద్ధి చెందింది. విదేశీ విషయాలను విమర్శనాత్మకంగా స్వీకరించడం పట్లా, ప్రత్యేకించి సోషలిస్టు ప్రపంచం నుండీ పెట్టుబడిదారీ ప్రపంచంలోని పురోగామీ ప్రజానీకాన్నుండీ విషయాలను స్వీకరించి ప్రవేశపెట్టడం పట్లా మనం తప్పక శ్రద్ధ వహించాలి.

క్లుప్తంగా కళకు తప్పనిసరిగా స్వతంత్రమైన, సృజనాత్మక గుణాలు వుండాలి. ఆయా కాలాల స్వభావాన్ని, జాతీయ స్వభావాన్ని కూడా అది పుణికి పుచ్చుకొని వుండి తీరాలి. చైనా కళ, మరింతగా, మరింతగా గతంలోకి చూడకూడదు. అది మరింతగా, మరింతగా పాశ్చాత్యీకరించబడకూడదు కూడా. ఆయా కాలాల, దేశం యొక్క విశిష్ట లక్షణాలను అది మరింతగా, మరింతగా ప్రతిబింబిస్తూండాలి. దీన్ని సాధించడానికి ప్రయత్నిస్తూనే మనం ప్రయోగాలు చేయడాన్ని తిరస్కరించకూడదు.

ప్రత్యేకించి సుదీర్ఘచరిత్రా, పెద్ద జనాభా వున్న చైనా వంటి దేశంలో, వివిధ జాతుల అవసరాలకు మరింత బాగా ఉపయోగపడేటటువంటి ప్రయోగాలను చేపట్టడం అనేది మరింత అవసరం. సంపూర్ణ ఏకరూపతను (యూనిఫార్మిటి) మనం కోరడం లేదు. ఏకరూపత, ఫార్ములా కనుగుణంగా రాయడానికి దారితీస్తుంది. విదేశీ ఫార్ములా అయినా, స్వదేశీ ఫార్ములా అయినా రెండూ నిర్జీవమైనవే. చైనా జన సామాన్యం వాటిని ఆహ్వానించరు.

పాశ్చాత్య విద్య నభ్యసించిన బూర్జువా మేధావులతో వ్యవహరించడం అనే సమస్య మనకిక్కడుంది. మనం ఈ సమస్య పట్ల సరైన తీరులో వ్యవహరించక పోతే, అది కళల మీదనేకాక, యావత్ విప్లవాశయం మీద కూడా దుష్ప్రభావాన్ని కలుగచేస్తుంది చైనా జాతీయ బూర్జువా వర్గమూ, దాని తాలూకు మేధావుల కొన్ని లక్షలమంది వుంటారు వారి సంఖ్య పెద్ద గొప్పదేమీ కాకపోయినప్పటికి వారికి అధునిక సంస్కృతి వుంది. మనం వారితో తప్పక ఐక్యమవాలి. వారిని ఎడ్యుకేట్ చేయాలి, వారిని తీర్చిమల్చుకోవాలి. దళారి వర్గానికి, దాని స్వీయ సంస్కృతి వుంది. అది బానిస సంస్కృతి. భూస్వామ్య వర్గానికి కూడా దాని స్వంత సంస్కృతి వుంది. అది భూస్వామ్య సంస్కృతి. చైనా కార్మికులకు, రైతులకు, సుదీర్ఘకాలంగా అణిచివేయబడ్డ కారణంగా సాంస్కృతిక విజ్ఞానం ఎక్కువగా లేదు. సాంస్కృతిక, సాంకేతిక విప్లవాల కర్తవ్యాలు పరిపూర్తి చేయబడేదాకా, పోల్చిచూస్తే బూర్జువా మేధావులకే మరింత ఎక్కువ విజ్ఞానమూ, నైపుణ్యమూ వుంటాయి. మన విధానం సరిగ్గా వుండి, మనం వారిని ఎడ్యుకేట్ చేసి, తీర్చి మల్చుకొంటె, మనం వారిచేత సోషలిజం ఆశయానికి సేవ చేయించగలం. మనం వారిని ఎడ్యుకేట్ చేసి, తీర్చి మల్చుకోగలమా? చేయగలం. ఇక్కడున్న వారిలో అనేకులు గతంలో బూర్జువా వర్గ పక్షమ్నుండి శ్రామిక వర్గం వైపుకు వచ్చిన బూర్జువా మేధావులే. తమక పైన పేర్కొన్నవారు కూడా మన వైపుకు ఎందుకురాలేదు? వాస్తవానికి మన వైపుకు వచ్చిన వారిప్పటికే అనేకులున్నారు. వారితో ఐక్యమయి, వారిని ఎడ్యుకేట్ చేసి, వారిని తీర్చి మల్చుకోడంలో మనం విఫలమవరాదు. మనం ఇది చేస్తేనే వారు కార్మిక వర్గ విప్లవాశయానికి, సోషలిస్టు విప్లవానికి, సోషలిస్టు నిర్మాణానికి ఉపయోగపడ గలరు.

ఇక్కడ వున్న మీరందరూ సంగీతసాధకులు. పాశ్చాత్య సంగీతాన్నధ్య

కవిత్వం - గతితార్కికత :

# అధి భౌతిక వైయక్తికత

జె. సి.

బూర్జువా కవిత్వం ప్రధానంగా ఆత్మాశ్రయమైంది. పశ్చిమదేశాల్లో ఉదారవాద యథార్థవాదం నుండి మొదలుకొని అధివాస్తవోద్యమం వరకు వైయక్తికానుభవం ఆధారంగా హేత్వాభాస (apparent rationalism) నుండి హేత్వాభావం (negation of rationalism) వరకు ఎన్నో దశలు సాహిత్యాన్ని, కవిత్వాన్ని ప్రభావితం చేశాయి. వీటన్నిట్లో సామాన్య లక్షణం అధిభౌతిక వైయక్తికత. వైయక్తిక చైతన్య ప్రత్యయాలన్నిట్నీ సరుకులుగా విరూపకం (reify) చేసి వాటి మధ్య సంబంధాన్ని నైరూప్యం చేసే ఈ అధిభౌతికతా ప్రక్రియకు సరుకుల మాయ అత్యంత ప్రచ్ఛన్న రూపం. ఈ ప్రచ్ఛన్నతలో భాగమే మనిషి చైతన్యంలోని మానసిక చేతన అచేతనలు, ప్రకృతిలోని దృశ్యాదృశ్య రూపాలు. ఈ ద్వంద్వాల్లో ఒకదానిలో ఇంకొకటి ద్యోతకం కావటం, ఒకదాన్ని ఇంకొకటి అభావంచేసి వాస్తవికతనే ఒక భ్రాంతిపూర్వక (paranoic) ఐంద్రజాలిక (magical) విశే

---

యనం చేయడంలో మీకు అనేక ముఖ్యబాధ్యతలున్నాయి. చైనీయ వైద్య విద్య తాలూకు క్రమబద్ధీకరణ, అభివృద్ధి ఏ విధంగానైతే పాశ్చాత్య శైలి వైద్యులమీద ఆధారపడి వుంటుందో, చైనీయ సంగీతపు క్రమబద్ధీకరణ, అభివృద్ధి అదేవిధంగా పాశ్చాత్య శైలి సంగీతాన్ని అభ్యసిస్తున్న మీమీదనే ఆధారపడాలి. మీరు అభ్యసించే పాశ్చాత్య విషయాలు ప్రయోజనకరమైనవే కానీ, మీరు పాశ్చాత్య, చైనీయ విషయాలు రెంటిలోనూ నేర్పరులవాలి. 'సంపూర్ణంగా పాశ్చాత్యీకరించకూడదు'. చైనీయ విషయాల పట్ల శ్రద్ధ పెట్టాలి. విశిష్టమైన జాతీయశైలి, రూపం వున్న మన స్వంత చైనీయ విషయాలను సృష్టించే లక్ష్యంతో వాటిని అధ్యయనం చేసి, అభివృద్ధి పరచడానికి మీరు శాయశక్తులా పాటుపడాలి.

వివరణలు

1. 'సగం వెనిగరే వున్న సీసా తొణకుతుంది, నిండు సీసా తొణకదు' అనే చీని సామెత.
2. సాంప్రదాయక చీని నవలలు, మౌఖిక కథాశైలి నుండి అభివృద్ధి చెందాయి. అధ్యాయాలు, అధ్యాయాలుగా సాగుతాయి.

షంగా మార్చటం దీని ప్రత్యేకత. ఈ ప్రక్రియ స్థలకాలాలతో నిమిత్తం లేనిదిగా భ్రాంతి గొలిపే ప్రక్రియ. అందువల్ల అది అత్యంతాకర్షకమైన మార్మికమైన సౌందర్య తత్త్వంగా కన్పిస్తుంది. ఈ గుణం యథార్థ వాదాన్ని పూర్వపక్షం చేసిన అన్ని రకాల ఆధునిక సాహిత్య ధోరణుల్లో ముఖ్యంగా అధివాస్తవిక చిత్ర కళలో కవిత్వంలో కన్పిస్తుంది.

అధి వాస్తవిక చిత్రకళాకారుల్లో అగ్రగణ్యుడయిన సాల్వడార్ డాలీ గురించి శ్రీశ్రీ చెప్పిన మాటల్లో అధివాస్తవికతా ధోరణి గురించి ఆయనకున్న అవగాహన సమగ్రంగా కన్పిస్తుంది :

> పాతగోడల మీద మరకలనూ, ఆకాశంలోని మబ్బులనూ తదేక దీక్షతో చూడడం ఇతని కిష్టం. మేఘాలలోంచి నా యిష్టం వచ్చిన బొమ్మను ఏరుకో గలనన్నారు....
>
> డాలీ చిత్రాలు పూర్తిగా మనశ్శాస్త్రం మీద ఆధారపడి వుంటాయి. Psychoanalysis ఇతనిని బాగా ఇన్‌ఫ్లుయెన్స్ చేసింది. ఇతని రచనలో స్వాప్నిక జగత్తు స్పష్టరూపం ధరిస్తుంది. తన బొమ్మలు "Hand-painted dream photographs."…. "ఉన్మాదికి నాకూ ఒకటే భేదం - నేను ఉన్మాదిని కాకపోవడం" అంటాడు డాలీ…. సరికదా, "….to cetinise the masses" (ప్రజల్ని వెర్రెత్తించడం) తన ఆశయమంటాడు. (శ్రీ శ్రీ వ్యాసాలు, విరసం ప్రచురణ, 1990: పే. 106-107.)

శ్రీశ్రీ ఈ మాటల్లో చెప్పిన గుణాలన్నీ సరిగ్గా అధివాస్తవిక కవితలో కూడా ఉంటాయి. ఉదాహరణకు "కరిగిపోయే చేప" అన్న ప్రతీకలోని వాస్తవికత ఐంద్రజాలిక విశేషంగా మారిపోతుంది.

సాధారణంగా అధివాస్తవిక కవులు వచన కవిత్వాన్నే రాస్తారు కాని దానిలో సామ్యత లేని (asymmetric) ఛందస్సాగసులు లేని ఒడిదొడుకుల లయకే ప్రాధాన్యత నిస్తారు.

కవిత్వం ప్రచురణలు ప్రకటించిన కొంతమంది కవుల సంకలనాల్లో సాల్వడార్ డాలీపై కవితలున్నాయి. దాన్నిబట్టి వారి కవిత్వంపై డాలీ ప్రభావం కొద్దో గొప్పో ఉందని అనుకోడానికి ఆస్కారం ఉంది. అయితే ఆ కవితల్ని పక్కకు

పెట్టి పేరే కవితల్ని ముఖ్యంగా త్రిపురనేని శ్రీనివాస్ రహస్యోద్యమంలోని కవితల్ని ప్రథమంగా పరిశీలిద్దాం.

"కవిత్వం కావాలి కవిత్వం" అన్న శీర్షికన గల కవిత నాసాంతంగా చదివితే మనకర్థమయ్యేది ఒక విషయం : 'కవిత్వ' మనేది ఒక అపురూపమయిన పదార్థం, సామగ్రి అన్న ఆలోచన కవికున్నదని. "అక్షరం నిండా జలజలలాడిపోయే కవిత్వం," "అక్షరం నిండా జివజివలాడిపోయే కవిత్వం." "టుప్పల్ తెప్పల్ మాటల్" కాని కవిత్వం, "కాగితంమీంచి కన్నులోకి (వెన్నులోకి గన్నులోకి) దూసుకుపోయే కవిత్వం," ప్రజల మీద రాయాల్సిన కవిత్వం, ప్రజలమీద కాక పాలకులమీద రాయాల్సిన కవిత్వం—ఇలా ఎన్నోరకాల కవిత్వాలున్నట్లున్నాయి ఈ కవికి ఈ రకమయిన దృష్టి మౌలికంగా యాంత్రిక భౌతికవాద దృష్టి. చలనం పదార్థ చైతన్యాలకు ఏకైక జీవలక్షణం అన్నది గతితార్కిక దృష్టి. గతితార్కికంగా సామాజిక చైతన్య రూపమయిన కవిత్వంలో శ్రమశక్తిలోని సృజనాత్మకత, శ్రామిక జన చైతన్యం వస్తువులో లయలో సహజంగా ప్రస్ఫుటిస్తుందన్న విషయం మనం వివరంగా తెలుసుకున్నాము. వర్గసమాజంలో ఈ సహజ పరిణామం వికటించి యాంత్రిక వైరూప్య అసమాన అధిభౌతిక లక్షణాలు పదార్థ, చైతన్య రూపాలన్నిటికీ తటస్థిస్తాయి. కవిత్వం ఒక పదార్థ మవుతుంది. అలాగే చైతన్య రూపంలో ఒక సాధనం అవుతుంది. కాని మానవుడు ప్రకృతి, సమాజంతో తనకు గల సంబంధాన్ని శ్రమ శక్తిగా, తనలోనే భాగమయిన చేతుల్ని ఉపయోగించుకొని ఏ విధంగా నయితే మార్చుకుంటాడో అలాగే భాషనుపయోగించుకుని కవిత్వంగా మార్చుకుంటాడు. (అలాగని చేతులు, భాష మనిషి శ్రమశక్తిలో భాగంకాకుండా సాధనాలు కావు.) ఈ గతితార్కిక దృష్టిని తెలిసోతెలియకో కాదని కవిత్వాన్ని ఒక ప్రత్యేక పదార్థంగా, సాధనంగా అనుకుని ఆ పదార్థం తన చేతిలో పుష్కలంగా ఉందని లేక సాధనాన్ని తాను ప్రత్యేక నైపుణ్యంతో వాడ గల కవిననుకుంటే అది అలౌకికతా వాదానికి, శిల్పవాదానికి తప్పక దారితీస్తుంది. త్రిపురనేని శ్రీనివాస్ విషయంలో గూడ సరిగ్గా ఇదే జరిగిందని "సంధ్యార్ణవం" అన్న కవితలోని ఈ క్రింది పాదాల్ని గమనిస్తే తెలుస్తుంది.

అందరికీ అర్థంకాని భాషకోసం అన్వేషిస్తున్నాను.
ముఖ్యంగా శవాలకు

రేపు నేను రాయబోయే కవితలో శిల్పం ఒక్కటే మిగేలుతుంది
శిల్పానికీ తనదైన భాష ఉన్నదని నేనెవరికీ చెప్పను

కవి ఈ విధమయిన నిర్ణయం తీసుకోవడం నిరాశ, నిస్పృహల వల్లనే అన్నది ఈ సంకలనంలోని కవితల్ని చదివితే స్పష్టంగా తెలుస్తుంది.

నిరాశ, నిస్పృహ అన్నది బూర్జువా చైతన్యంలో సటకుల మాయ మనిషిని ఆచరణ శీలత్వం నుండి పరాయీకరింపబడిన అస్తిత్వంగా దిగజార్చడంవల్ల కల్గే అవస్థగా అంటే తననుండి తాను పరాయీకరణ చెందిన మనిషి ఉద్రేకంగా చెప్ప వచ్చు. త్రిపురనేని శ్రీనివాస్‌లో కలిగిన ఈ నిరాశ తన చుట్టూ సమాజంలో జరిగే అన్యాయాలు, అక్రమాలు, హత్యలు, దోపిడీ అనబడే వ్యతిక్రమంలో నిక్షిప్తమై ఉన్న కార్యకారణ క్రమానికి తన అస్తిత్వానికి మధ్య వైరుధ్యం ఏర్పడ్డం వల్లనే అనుకుంటాను. ఒకప్పుడు విప్లవ కవిగా గతితార్కిక భౌతిక వాదాన్ని అంగీకరించి కవిత్వం రాసిన ఈ కవి తన చుట్టూ సమాజంలో జరిగే వ్యవస్థాపరమైన అన్యాయాల విషయంలో సామాజిక బాధ్యతను గుర్తించిన కవి. కాని తరువాత తరువాత ఒక విప్లవ కవిగా తనకున్న పాత్ర మొదట ఆయనకేర్పడ్డ అధిభౌతిక భావధోరణి వల్ల చైతన్యవంతమైన ఆచరణకు తన అస్తిత్వానికి మధ్య ఏర్పడ్డ పరాయీకరణ ఆ నిర్వేద భావాన్ని అతనిలో కల్గించింది అని అనుకోవాల్సి వస్తున్నది. వైయక్తిక అస్తిత్వానికి సామాజిక ఆచరణ ప్రాతిపదికైతే అది సజీవంగా విప్లవాత్మకంగా ఉంటుంది. కాని వ్యక్తిగత ఊహాల్లోని నిరాకారత ప్రాతిపదికైతే ఆ ఊహల నైసర్గిక ప్రాతిపదిక, వర్గ సమాజంలో కూరుకుని ఉంటే ఆ వ్యక్తి అస్తిత్వం సమష్టి ఆచరణలో సంపూర్ణంగా అభావం చెందితే తప్ప సామాజిక చైతన్యంతో మమేకం కాదు. అందుకవసరమైన సంపూర్ణ విప్లవాచరణ ఈ కవి భావాల్లో భాగం కాలేదనే అన్పిస్తున్నది. 1986లో చిత్తూరు జిల్లా విరసం యూనిట్ ప్రచురించిన ఈయన కవితా సంకలనం గోదావరీ ప్రవహించు లోని ఒక కవిత, "నేను నా లోకి"ని పరిశీలిస్తే ఈ విషయం స్పష్టమవుతుంది.

ఊహల్లో నిరాకారత
ఆకారం కోసం వెదుకుతున్న వేళ
నేనెవరో నేనేమిటో నాకే తెలియదు
నేను నాలో నాతో విడిది చేసినపుడు

నేను నాలో నాతో సదస్సు నిర్వహిస్తున్నపుడు
నాలో నాకు తెలియని నేను వికసిస్తున్నపుడు
.... .... ....
ఊహల్లో నిరాకారత
ఆకారాన్ని చేరుకుంటున్న వేళ
నేను నాలో
లీనమై విలీనమై సంలీనమయ్యె
సంగ్రామ ఘట్టానికి తుదిరోజుల్లో
నా అరచేయి ధరిత్రిలో వేళ్ళ రోజాలు
ఎరుపెక్కడం చూసాను
రోడ్లమీద నా సంచారాలలోని
అగ్నికీలలికి నిఘంటువు దొరికింది
మాట వెనుక మరో మనిషిని నగ్నం చేసే
భాషలో పునీతమయ్యాను
బహిష్కృతుడి భావావేశం
బంధం సృష్టించలేదని తెలుసుకున్నాను

తనలో వైయక్తిక చైతన్యానికి, వ్యక్తిగత ఊహలకు మధ్య ఒకప్పుడు జరిగిన నిరాకార మథనం : "సంగ్రామ ఘట్టం" తుదిరోజుల్లో ఆయనకు విప్లవం ఎడల అధివాస్తవికంగా ఆత్మాశ్రయ నిబద్ధత ఏర్పడింది అని చెప్పుకుంటున్నాడు కవి. "నా అరచేయి ధరిత్రి", "వేళ్ళరోజాలు ఎరుపెక్కడం", "రోడ్లమీద నా సంచారాల లోని/అగ్ని కీలలికి నిఘంటువు దొరికింది" — ఈ మాటల్లోని ప్రతీకలు అన్నీ పాశ్చాత్య భావ ప్రతీకలే. అతనిలో చెలరేగిన నిరాకార మానసిక సంఘర్షణ, రోడ్డు మీద సంచారాల వంటి నిరర్థక వెతుకులాటలో అతనిలో పెల్లుబికిన ఆత్మాశ్రయ ఉద్రేకాల "అగ్ని కీలలికి" లభించిన "నిఘంటువు" ఒక అధివాస్తవిక నిఘంటువే. దానిలోని పదాలకున్న అర్థాలు అన్నీ సాల్వడార్ దాలీ చిత్రాల్లో ఉన్నట్లు "బహుముఖ సమర్థనం" (శ్రీశ్రీ వ్యాసాలు, పే. 107) కింద వచ్చే అర్థాలే. ఆ నిఘంటువు ననుసరించే త్రిపురనేని శ్రీనివాస్ కవిత్వం విప్లవోద్యమం లక్షణాన్ని అధివాస్తవీకరించుకుని రహస్యోద్యమంగా మారినట్లనిపిస్తున్నది.

అధివాస్తవీకరణ ముఖ్యంగా ప్రత్యేక ప్రతీకల్లో తన అస్తిత్వాన్ని ప్రకటించుకుంటుంది :

కన్నుల్లో వెలుగుతున్న లాంతరు చీకట్లోకి ఎగిరిపోయింది
గుండెల్లో తిరుగుతున్న తోపుడు బండి చిత్రంగా
    గుండెకాయనే మోసుకెళ్లిపోయింది
మూలమీద నిలబెట్టిన కిళ్లీ బడ్డీ అటు మలుపు తిరిగి
    ఎవరితోనో నడిచిపోయింది
చొక్కాలు గాలిలో తేలుతూ కనిపించిన మనిషిని తొడుక్కున్నాయి
తరతరాల అస్తిత్వ వేదన తారతమ్యం చూపనిది ఇక్కడే
నగరం కొత్తముఖం అతికించుకునేది ఇప్పుడే

ఈ ప్రతీకలన్నీ నగరంలో జరిగే దారుణమారణకాండకు ప్రతీకలని అనుకోవాలి. భ్రమా భాజనమైన ఇటువంటి అధివాస్తవిక ప్రతీకలు జీవితంలోని అస్తవ్యస్తాలను చాలా బలంగా చిత్రీకరించడానికి పనికి వస్తాయి. కాని అదే పరమావధి అయితే కవిత్వానికి జీవితానికి ఉన్న గతి తార్కిక సంబంధాన్ని సంకుచితపరుస్తాయి. ఉదాహరణకు రహస్యోద్యమం మకుటంగా మలచిన కవితను పరిశీలిస్తే ఈ విషయం అర్థమవుతుంది :

అక్షరానికి పాలుతాపి పదం చేయాలి
పదానికి అన్నం పెట్టి వాక్యం చేయాలి
వాక్యానికి శిక్షణ ఇచ్చి కవిత్వం చేయాలి
కవిత్వానికి జీవితాన్నిచ్చి ఆయుధం చేయాలి

అంటాడు కవి. బాగానే ఉంది కాని మూడవ పాదంలో చెప్పినట్లు "వాక్యానికి శిక్షణ" యిస్తే మంచి వచనమౌతుంది తప్ప కవిత్వం గాదు. అలాగే కవిత్వానికి జీవితాన్నియ్యడమంటే అది ఆత్మాశ్రయ ధోరణిలో భాగమైన త్యాగమౌతుంది. దాని వల్ల మంచి కవిత్వం వచ్చే నమ్మకం లేదు. నిజానికి సామాజిక చైతన్య రూపమయిన కవిత్వానికి జీవితానికి మధ్య పరిణామశీలమైన ఆచరణాత్మక సంబంధం ఉంటుంది. ఆ గతితార్కిక సంబంధాన్ని సూచించడాన్కి ఈ మకుటాన్ని ఈ కింది విధంగా మారిస్తే బాగుంటుందని నా ఉద్దేశ్యం!

అక్షరానికి పాలుతాపి పదం చేయాలి
పదానికి అన్నం పెట్టి వాక్యం చేయాలి
వాక్యానికి శిక్షణ ఇచ్చి ఆయుధం చేయాలి
జీవితానికి ఆయుధాన్నిచ్చి కవిత్వం చేయాలి
కవిత్వానికి జీవితాన్నిచ్చి సాయుధం చేయాలి

*　　*　　*

కవిత్వం ప్రమాణాలు- 7 వ సంకలనం గుడిహాళం రఘునాథం కవిత్వం కూడా ఆయన మాటల్లోనే చెప్పాలంటే “రియలిజమ్, సర్రియలిజం అన్నుకునే స్నేహం”లో ఉద్భవించిందే. అంటే రియలిజమ్ సర్రియలిజమ్‌ల మధ్య వైరుధ్యం సడలి ఐక్యతగా మారే అధి భౌతిక సరుకుల మాయలో పుట్టిన కవిత్వమే కుహనా శాస్త్రీయత, హేత్వాభావం, సమాజ జీవితంలోని మురికివాడల్లోని కుళ్ళు కంపుల్ని చిత్రీకరించడంలో మొత్తంమీద డాక్యుమెంటరీ పద్ధతిని అవలంబించే ధోరణి, కార్మిక వర్గం వర్గపోరాట కార్మికులైన స్త్రీ పురుషుల్ని యజమానులు చేసే దోపిడి. దానికి వ్యతిరేకంగా జరిగే తిరుగుబాటుల విషయంలో అంటే పారిశ్రామిక అభివృద్ధి నేపథ్యం లోని బీభత్సాన్ని ఆత్మాశ్రయ ధోరణిలో అర్థం చేసుకునే రీతిలో యథార్థవాదం ఇరువయవ శతాబ్దంలో వాస్తవికతా వాదంగా (nationalism) గా మారింది. అమ్మకపు విలువ ప్రత్యేక వ్యక్తుల్ని, వ్యక్తుల మధ్య సంబంధాల్ని, వ్యక్తికి సమాజానికి మధ్య సంబంధాన్ని, వర్గాల మధ్య సంబంధాన్నే కాక నీతి, అవినీతులవంటి అమూర్త విలువల్ని కూడా పరిమాణాత్మక (quantitative) ప్రత్యయాలుగా మార్చే ఆధునిక ధోరణి వాస్తవికతా వాదం. దీనికీ అధి వాస్తవికతకూ మధ్య ఉన్న వైరుధ్యం అధి భౌతిక యథార్థానికీ భ్రమకూ మధ్య ఉన్న వైరుధ్యం వంటిదే.

ఫోర్త్ పర్సన్ సింగ్యులర్ అనే ఈ కవితా సంకలనంలోని మొదటి కవిత “అంకితం” లోని ఈ క్రింది పాదాల్ని పరిశీలిద్దాం :

అందాల కోసం
రంగు రంగుల దృశ్యాల కోసం
నీ ఎదుటి గోడలో
లలిత లలితంగా కదిలే తటాకాల కోసం

కెరటాల మధ్య పరిగెత్తే గుర్రాల కోసం
తొక్కిసలాడే కన్ను ! ?
ఇంకా ఎంతకాల మెంతకాలం జ్వాల కాలేని బతుకు ?
మందు బాట్లతో చలికాలం నడుస్తున్నప్పుడూ
వేయి కళ్ళతో — వర్షం
కిటికీలోంచి తొంగిచూస్తూ, జారుతూ, తొంగి చూస్తున్నప్పుడూ
సెగల పాముల్తో ఎండాకాలం నర్తిస్తున్నప్పుడూ
బ్రాందీనీ, విస్కీని, బీరు బుడ్లనీ
పీల్చి
హాయిగా, సుందర స్వప్నంలా ఊగే మత్తు చెట్లై
ఇంకా ఎంతకాల మెంతకాలం ?

రా, అన్నా, రా !
ఇల్లొదిలి, బారొదిలి
తడితడి వెన్నెలల చంద్ర బింబాల్నొదిలి
ఆశల భ్రమల్నొదిలి
సాయంత్రాల్ని కార్చుకునే ఆదివారాల్నొదిలి
మురికి మురికి ఆకాశాల్నొదిలి
విరిగి విరిగి పడుతున్న వచన కవిత్వాల్నొదిలి
రా, భాయీరా ! ! మన సముద్రంలో కలుద్దాం ....

వాస్తవికతావాద ప్రతీకలకు ఇదమిద్ధమైన అర్థ ప్రతిపత్తి ఉంటుంది. ఈ కవితలో మాదిరిగా. "అందం" అంటే ఎంత ఆకర్షణో జీవితంలో వికారాలంటే కూడా అంతే ఆకర్షణ వాస్తవికతావాద కవికి. కోపం, పగ, పశ్చాత్తాపం, "జనాల్లో అల్లుకున్న గహనాంధపులు" ఇలాగే అన్ని రకాల వాస్తవికతలకు ఇదమిద్ధమైన సమాన ప్రతిపత్తి ఉంటుంది. ఒక వాస్తవికత నుండి ఇంకో వాస్తవికతకు మధ్య చలనం కూడా ఇదమిద్ధంగానే ఉంటుంది. కవి చేయాల్సింది, పాఠకుని చేయమని ప్రోత్సహిస్తున్నది ఒక వాస్తవికతను విసర్జించి ఇంకో వాస్తవికతను ఎన్నుకోమనే.

సంకలనంలోని అయిదో పేజీ నుండి పంచొమ్మిదవ పేజీ వరకున్న కవిత లన్నీ స్థూలంగా వాస్తవికవాద కవితలే. కాని అక్కడక్కడ ఆ కవితల్లో అధి

వాస్తవికవాద లక్షణంలోకి క్రమించే ప్రతీకలు కూడా కన్పిస్తాయి.

ఉదాహరణకు : "నా చేతుల్లో కెత్తుకున్న గీతం జారిపడి ముక్కలు ముక్కలౌతుందన్న భయం లేదు" ("వికసించే గీతం", పే. 16) అన్న ప్రతీక. ఇక ముందుకు పోతే "మిడిల్ క్లాసు యౌవనం" (బస్సుందరి స్పర్శతో/ బస్సే చిగురించి నట్టపటవు), "నగరం" (నినాదాలు/గోడలకు వేలాడుతున్నా యెర్రగా), "పురుషాటవి" (నేనో భయంకర, అభద్ర, అటవినై విస్తరిస్తూంటే) మొదలగు కవితల్లో వాస్తవితావాదాన్ని పూర్వపక్షం చేసి అధివాస్తవికత విస్తరించింది.

ఈ విధంగా గుడిహాళం రఘునాథం కవితలు కూడా ఆత్మాశ్రయ ధోరణి ప్రధానంగా కల ఆధునిక కవిత్వమే. ఈ ధోరణి వల్లనే తన సంకలనాని కిచ్చిన శైటిలు, ఫోర్త్ పర్సన్ సింగ్యులర్, సూచించినట్లు ఈయన కవిత్వంలో చరిత్ర కాకుండా తన స్వగతమే అంతర్గత అస్తిత్వమే చతుర్థనామవాచకం ఏకవచనమై ప్రవర్తిస్తుంది.

సాహిత్యంలో వాస్తవికతావాదం ప్రపంచంలో ప్రతి వస్తువును, స్థలకాలాల్ని మనిషి చైతన్యాన్ని, ప్రవృత్తుల్ని, చివరికి వర్గాల్ని, వర్గ స్పృహను కూడా అధి భౌతిక ప్రత్యయాల్ని గానే పరిగణిస్తుంది. వర్గదృష్టి, వర్గస్పృహ ఉన్నా సమకాలీన సమాజంలోని విపత్తులన్నింటికి చరిత్రలో మానవుడు చేసిన తప్పిదాలే కారణమని నమ్ముతుంది. సమాజానికి ఏది మంచి, ఏది చెడు అన్న విషయంలోను, వ్యక్తి చైతన్యంలో ఉండాల్సిన గుణాలేవి, ఉండకూడని గుణాలేవి అన్న విషయంలోనూ అలాగే ఆదర్శం, ఆచరణల విషయంలోనూ, నిర్దిష్ట నీతిపరమైన యాంత్రిక ధోరణినే బలపరుస్తుంది. నీతిపరమైన ఈ ధోరణి వల్లనే – పరుకుల స్థాయికి దిగజారిన అన్ని అధి భౌతిక ప్రత్యయాల వల్లనే మానవ చైతన్యం నేర భూయిష్ఠమైన ప్రతిపత్తిని ఆపాదించుకుంటుంది. ఆదర్శం, ఆచరణలు గతితార్కికంగా మనిషి ప్రవర్తనలో వృద్ధి చెందుతాయన్న అవగాహన ఈ వాదాన్ని బలపరిచేవారిలో ఉండదు.

ఈ ధోరణి ప్రపంచ వ్యాప్తంగా, ముఖ్యంగా మనదేశంలోని అర్థవలస, అర్థ భూస్వామ్య భావజాలంలో సులభంగా ఇమిడిపోయే ధోరణి. ఈ ధోరణే తరువాత అధి వాస్తవిక ధోరణిలోకి మారిపోయినట్లు ఇదివరకే చెప్పుకొన్నాం. సరిగ్గా ఈ ప్రక్రియలోని మార్మికతే స్మైల్ కవిత్వంలో కన్పిస్తుంది.

"తూనీగ" అనే కవిత (ముఖడే, స్మైల్ కవితలు కొన్ని, కవిత్వం ప్రచురణలు - 4)లో కవి చిన్నపిల్లవాడుగా ఉన్నప్పుడు తూనీగల్ని పట్టి ఆనందించేవాడు. పెద్దైం తర్వాత ఆ సంతోషం అతడి నుండి ఎగిరిపోయి తూనీగ నురాగానికి పశ్చాత్తాపం చోటుచేసుకున్నది. ఈ కవితలో కవి మానవ చరిత్రలో మాదిరిగానే అమాయకత్వం నుండి నేరంలోకి ఎదుగుతాడు.

వేళ్ళ కొండలై పోయేవి తూనీగ దొరికేదాకా

..... .....     ..... .....     ..... .....

తూనీగతోక పట్టుకున్నప్పుడు
రంగులోకాల నీడ నున్నటి అద్దాల కళ్ళలో మిలమిలా మెరిసేది
చూసేస్తున్నానని కాబోలు నా అరచేతిని కరచేది తూనీగ
మెత్తటి కసి దవడల్తో
వొదిలే వాణ్ణికాదు. వొదిత్తే
నేమనసుతోతపు ఎగరలేని ఎత్తులకి
మళ్ళా గాలిలో రెక్కల చేపల్లే ఎక్కడికో యీదుకు పోతుందని
తోకకి దారం కట్టి వొదిలేసే వాణ్ణి

చిన్నపిల్లవాడి సంతోషంలోని క్రౌర్యాన్ని సూచించే వర్ణనలో అక్కడక్కడ వచ్చే "కసి దవడలు" "రెక్కల చేప"ల వంటి అధివాస్తవిక ప్రతీకలు తప్పిస్తే వాస్తవికతా ధోరణే ఈ కవితలో ప్రధానంగా వుంది. కాని చివరలో "తుమ్మ ముల్లుకు తూనీగని సిలువ" వేసిన తర్వాత అది చచ్చిపోయి మిగలనీ ("ముల్లుమాత్రం అలాగే వుంది- మొన మీద గుచ్చుకు వున్న గుండెతో/ నా గుండెతో నా గుండెతో/ నా గుండెతో") ముల్లు మీద శిలువ వేయబడ్డ తూనీగ గుండెను కవి తన గుండెతో అధివాస్తవికంగా విరూపకం చేసుకుంటాడు.

"డాలీ నుంచి ఓ కొన్త గాలి" అన్నకవితో "జ్ఞాపకం వస్తావు డాలీ/ గడియారం కరగి ప్రవహిస్తూ-/ ఓ తుమ్మముల్లు శూన్యంలోకి కలుక్కున దిగబడినట్లు/ నిటారుగా నిలుస్తుంది" అని స్మైల్ డాలీని బాధాకరమైన జ్ఞాపకంగానే జ్ఞప్తికి తెచ్చుకుంటాడు. ఈ అధి వాస్తవిక ప్రతీకల్లో ఆధునికుడైన మనిషి ముఖ్యంగా పెటీ బూర్జువా, మనస్సులోని కాలాతీత నిర్లిప్తత, నైరూప్య నేర భావం కల్గించే తపన యాదృచ్ఛిక

మైన మనిషి అస్తిత్వం, నైరూప్య చారిత్రకావసరంల మధ్య, చేతనా చేతనల మధ్య గల నోమాన్స్ లాండ్‌లో మాదిరిగా ప్రకటితమౌతాయి :

"డాలీ/ నీకు నేనేం అవను/ అర్థమవనే అవను-/ నువ్వూ నాకు నీలానే/ అర్థం అయీ అవకు/ జీవితంలాగే/ శాశ్వతంగా జీవితంలాగే/ శాశ్వతం లాగే" అన్నట్లు అయితే, ఈ పాదాల చివర "కవిత్వంలో లాగే" అన్న మాటల్ని చేరిస్తే ఈ పాదాలు సరిగ్గా అధివాస్తవికతావాద కవిత్వానికి నిర్వచనమౌతాయి.

× × ×

ఇదే వరుసన ఖాదర్ మొహియుద్దీన్ కవితా సంకలనం పుట్టుమచ్చ (కవిత్వం ప్రచురణలు-11) ను కూడ విచారించాల్సిన అవసరం ఉంది. కవి పేరును కనుక పుస్తకం ముందు అట్టలపై ముద్రించకపోతే, అలాగే టైటిల్ కవిత అయిన "పుట్టుమచ్చ"లో ఆయన అస్తిత్వ వేదనను కనుక గమనించకపోతే– కేవలం ఆయన కవిత్వాన్నే పరిగణనలోనికి తీసుకుంటే ఈయన కవిత్వం అర్థ వలస, అర్థ భూస్వామ్య భావజాలం పరిధిలో సరుకుల మాయ, సాంప్రదాయకతల మేళవింపుకు అనుగుణమైన వాస్తవికతావాద అధివాస్తవికతల అధి భౌతిక తత్వమే మనకు కన్పిస్తుంది. ఉదాహరణకు,

పాడు మనసు తాను పడుకోదూ
నన్ను పడుకోనీయదూ ("తప్పదిక")
ప్రపంచం బరువుతో
జీసస్ శిరస్సులా
వేలాడుతున్న తాళం ("సిగరెట్టు పీక")
చచ్చిపోతూన్న చిరునవ్వు ("సిగరెట్టు పీక")
నా శరీరం పేరు మానవుడు
నేను చదువుతూన్న కాగితం పేరు మానవుడు ("సిగరెట్టు పీక")
మృత్యువును కాదు
ఎంత ఘోరంగా వున్నా
బతుకునే ప్రేమించిన మనిషి ("ఆత్మహత్యాగ్రహం")

ఈ లైన్లలోని ప్రతీకల్లో నైరూప్య నేర నిరాశావహ మానవతల వంటి ప్రత్యేక ప్రత్యయాల ప్రసక్తి కన్పిస్తుంది.

ముఖ్యంగా కవి తనకో ప్రత్యేక ప్రతిపత్తిని ప్రయత్నపూర్వకంగా ఆపాదించుకొనే ప్రయత్నం చేస్తాడు. ఫైటిల్ కవితలో సరుకుల ప్రపంచంలో ప్రతి సరుకూ మిగతా వాటికంటె ప్రత్యేకమైందని, విశిష్టమైందని చెప్పే ధోరణే ఇది :

ఒక కట్టుకథ నన్ను కాటేసింది
ఒక వక్రీకరణ నన్ను వంచించింది
ఒక అపనింద నన్ను అల్లరి పాల్జేసింది

అని చెపుతూ

నేను పుట్టకముందే
దేశద్రోహుల జాబితాలో
నమోదై వుంది నా పేరు
..... ..... ..... ..... .....
నా అస్తిత్వం చుట్టూ

అనుమానాల వలయాన్ని విస్తరిస్తుంది వర్తమానం అంటూ తన అస్తిత్వాన్ని చరిత్రలోని పాక్షిక సత్యంలో ముడి పెట్టుకుంటారు.

1947లో "హిందీ - హిందూ - హిందూస్థాన్/ ముస్లీంజావో పాకిస్తాన్" "ముసల్మాన్‌కే దోహీస్థాన్/ పాకిస్తాన్ యా ఖబరస్థాన్" అన్న నినాదాలు అప్పటి దేశవిభజనలో జిన్నా, నెహ్రూ, పటేల్‌ల వంటి కంప్రడార్ బూర్జువాల రాజకీయాల ఫలితంగా హిందు మహాసభ వంటి మతోన్మాద సంస్థలు లేవదీసిన నినాదాలు. అప్పటి దేశరాజకీయాల్లోని అధి భౌతిక యాంత్రిక దృష్టి వలసవాద రాజకీయాలు పన్నిన "విభజించి, పాలించు" అన్న కుట్ర, దానితో కుమ్మక్కైన పాలకవర్గాల కుట్రలమధ్య కార్యకారణ సంబంధముంది హిందూ మతోన్మాదానికి సమంగా ముస్లిమ్ మతోన్మాదం కూడా అప్పుడు పెచ్చు రేగిందన్న విషయం అందరికీ తెలుసు.

భారతదేశంలోని సంస్థానాలన్నింటిని ఇండియన్ యూనియన్‌లో విలీనం చెయ్యాలని పటేల్ తలపెట్టినపుడు నైజాం రాష్ట్రంలో రాచరికపు దన్నుతో తలెత్తిన మతోన్మాదశక్తి కాశిం, రజ్వీ, ఆధ్వర్యంలోని రజాకార్లు. ఈ రజాకార్లు చాలా వరకు పట్టణాల్లో ఉండే అస్తిపరులైన ముస్లిములు లేదా పల్లెల్లో ఉంటూ కూడా వ్యవసాయోత్పత్తిలో శ్రమించని పరాన్నజీవులైన మతవాదులే. తరతరాలుగా నైజాము

రాజ్యంలో ముఖ్యంగా తెలంగాణాలోని వెనుకబడ్డ రైతుల్ని పీల్చి పిప్పిచేస్తున్న జమీందారుల్తో కుమ్మక్కై నరమాంసం రుచిమరిగిన పులుల వంటివారు. నైజాం గద్దె దిగేలోగా తెలంగాణాలోని రైతుల్ని, స్త్రీలను, పిల్లల్ని ఊచకోతకోస్తూ వాళ్ళ జీవనాధారాల్ని ముఖ్యంగా జీవితాంతం కష్టపడి చేయించుకున్న ముక్కుపుడకో చెవికమ్మలో పుస్తె తాళ్ళో ఉంటె వాటిని కొల్లగొడ్తూ ఉదా యిద్దామని ప్లానువేసుకుని మరీ తమ ఘాతకాల్ని సాగించారు. హైద్రాబాదు నగరంలో ఈ రజాకార్ల దౌర్జన్యం నుండి రక్షించుకోడానికి అంతకంటె ముందురోజు వరకు ముస్లిమ్‌లతో భాయీ-భాయీ అని తిరిగిన ఉదార హిందూవాదులైన ఆర్య సమాజీయులు కూడా మిలిటెంట్ రక్షణ వ్యూహాల్ని రచించుకోవాల్సి వచ్చింది.

అయితే గ్రామాల్లో రైతుకూలీల్లో భాగమయిన ముస్లిం సోదరుల్లో మాత్రం "బందగీ" వంటి వారు అప్పుడూ ఉన్నారు, ఇప్పుడూ వున్నారు.

మతోన్మాదులైన ముస్లిం రజాకార్ల నుండి గ్రామాల్లోని రైతులకు, స్త్రీలకు, పిల్లలకు రక్షణ కల్పించే విషయంలో కమ్యూనిస్టులు ప్రధాన పాత్ర వహించారు.

ఈ చారిత్రక నేపథ్యంలోనే శ్రీశ్రీ 'కసాయి' 'షాయిబు' అన్న పదాల్ని కలిపి 'కసాయిబు' అన్న కొత్త మాటను సృష్టించాడు. సుద్దాల హనుమంతు, పాటలో 'తురకల' నరకమని ఉన్నా ఆ పాట ఆయన స్వయంగా కట్టినా కట్టకపోయినా రజాకార్లకు వ్యతిరేకంగా తెలంగాణా రైతు కూలీల ప్రతిఘటనలోంచి తన్నుకు వచ్చిన పాటగానే దాన్ని పరిగణించాల్సి వస్తుంది. కాని దానికి మతతత్వాన్ని అంట గట్టాల్సిన అవసరం లేదు.

మత ధోరణి ఎప్పుడైనా ఎక్కడైనా అధి భౌతిక యాంత్రిక ధోరణే. భారత దేశం వంటి అర్ధవలస, అర్ధ భూస్వామ్య సమాజాల్లో మతం పాత్ర ప్రధానంగా పాక్షిక, విచ్ఛిన్నకర విరోధ లక్షణాల్నే కల్గి ఉంటుంది. అయితే ఈ లక్షణాలు వీధిలో పడి పశుత్వంగా మారినపుడు వాటి ప్రస్తుత లక్షణాల్ని వర్ణించడం జీవిత వాస్తవికతను తన కావ్య వస్తువుగా వించుకున్న కవియొక్క బాధ్యత అవుతుంది. అలా చేయకపోవడం మతసామరస్యం, మైనారిటీ మతస్థుల హక్కుల సంరక్షణ అనే ఆచరణాత్మక అవసరాల్ని ఆదర్శవాదం అనే నీతితో యాంత్రికంగా ముడి బెట్టడం లేక రాజకీయ ప్రయోజనాల కోసం ఓటు కోసం ముఖస్తుతి చేయడమే

అవుతుంది. కాని వాస్తవంలో మనదేశంలో కాంగ్రెసు పార్టీ చేసినట్లు ఒకవైపు మైనారిటీ మతస్తుల అహాన్ని ఊదరగొడ్తూనే ఇంకోవైపు మత కల్లోలాల్లోకి వారిని నెట్టివేయడం జరుగుతుంది.

క్షమించండి, నా స్నేహితుల్లారా!
వక్రీకరణకు వత్తాసుగా
పదబంధాన్ని సృష్టించి
నన్ను వెక్కిరించడానికి వెనుదీయని
మహా కవిని నేను మన్నించలేను !
మన్నించండి, నా మిత్రులారా!
రాజుకీ, పేదకీ మధ్య
భేదాన్నే చూడలేని
ప్రజాకవి ఉద్రేకానికి
నేను ఉత్రూత లాగలేను

బాగానే ఉంది. కానీ శ్రీశ్రీ చేసింది వక్రీకరణకు వత్తాసు కాదు. గతితార్కిక చారిత్రక పద బంధం మాత్రమే. ఆ పద బంధాని కర్థం రజాకార్ల అరాచకత్వానికి పరిమితమైందే దాన్ని ముస్లిములందరిపై వ్యాఖ్య అనుకోవడం యాంత్రిక ధోరణి కిందకు వస్తుంది. అలాగే తన అస్తిత్వాన్ని ముస్లింల నైరూప్య అచారిత్రత అస్తిత్వంలో ముడి బెట్టుకోవడం యాంత్రిక ఆత్మాశ్రయ ధోరణే.

అదే విధంగా "రాజుకి పేదకీ మధ్య భేదాన్నే చూడలేని ప్రజాకవి" సుద్దాల హనుమంతు అని ఏ భౌతిక పరిస్థితుల్లో ఆ మాటలన్నాడో అర్థం చేసుకోకుండా అంటే అది అచారిత్రక వాదానికి, పిడివాదానికి మచ్చుతునక అవుతుంది.

చరిత్రను ఉత్పత్తి శక్తులకు ఉత్పత్తి సంబంధాలకు మధ్య జరిగే పోరాటం నుండి పుట్టే సామాజిక సంబంధాల చిత్రీకరణ కార్య పాలక వర్గాన అవకాశవాదానికి వత్తాసుగా పనికొచ్చే అధి భౌతిక వాస్తవి కళావాద చిత్రణగా అర్థం చేసుకుంటే ఈ విధంగానే జరుగుతుంది. కవిత్వాన్ని వాస్తవికతావాద, అధి వాస్తవికవాద ప్రత్యయంగా వాడుకునే పెటీబూర్జువా చైతన్యానికి ఈ రకమయిన చారిత్రక అంధత్వం సాధారణమయిందే.

ఖాదర్. మొహియుద్దీన్‌లో అణచివేతకు గురైన నిజమయిన మైనారిటీ చైతన్యం కనుక ఉంటే అది అర్ధ వలస, అర్ధ భూస్వామ్య అధి భౌతిక భావజాలంతో పుట్టు మునక లేస్తున్నట్లు సులభంగానే అర్థమవుతున్నది. "తప్పదిక" "సిగరెట్టుపీక" "ఒక నిర్లిప్త పాటు" "చెప్పుల్తో దుక్కున్న శవం" వంటి కవితల్ని నిశితంగా పరిశీలిస్తే.

*                *                *

కవిత్వం ప్రచురణల మొట్టమొదటి సంకలనం క్రితం తర్వాత (1990) అఫ్సర్, కె. నరసింహాచారి, కృష్ణుడు, నీలిమాగోపీచంద్, ప్రసేన్, త్రిపురనేని శ్రీనివాస్ అనే ఆరుగురు కవుల సంయుక్త అధి వాస్తవిక కవిత. ఈ కవితలో కవిత్వం ప్రచురణల పేరుమీద వచ్చిన కవుల కవిత్వం (రావిశాస్త్రి ఎన్నెల్లో ఎన్నెల తప్పించి)లో ఉన్న గందరగోళమంతా ఉంది. ఉదాహరణకు

> సిద్ధాంతాలు ఏవైనా సంస్థాగతాలు ఏవైనా
> కొత్త పూలమొక్కని సృష్టించడమే సృజనాత్మకత
> నాడీమండలంలో కొత్త ప్రకంపనాలను కదిలించడమే విప్లవీకరణ

అన్న సిద్ధాంత ప్రతిపాదనలు చేశారు సృజనాత్మక విప్లవీకరణల గురించి. కాని పూలమొక్క పదార్థ చైతన్యం నుంచి పుట్టుకొస్తుంది. గతితార్కికంగా కాని ఒక పూలమొక్కను కొత్త పూలు పూసే మొక్కగా హైబ్రిడైజ్ చేస్తే అది కొత్త పూల మొక్కను సృష్టించే సృజనాత్మకత కాదు. అలాగే నాడీమండలంలో కొత్త ప్రకంపనాలను కదిలించేది విప్లవీకరణ కాజాలదు. అది ఆధునిక మత్తు పదార్థాలు కలిగించే తాత్కాలిక భౌతిక సంచలనమే. మనిషి సామాజిక చైతన్యంలో సృజనాత్మకతతో పాటే విప్లవీకరణ అనేది అతని ఆచరణలో సంపూర్ణంగా శ్రామిక వర్గ చైతన్యంగా ఎదిగే క్రియ. కాని ఈ కవులందరికీ సృజనాత్మకత, విప్లవీకరణ అంటే ఉన్న అభిప్రాయాలన్నీ యాంత్రికమూ, అసహజమైనవిగానే కన్పిస్తున్నాయి.

> "స్వేచ్ఛంటే పెరట్లో తులసి మొక్క కాదు
> తల్లి గొంతులో పెగలని స్వరం స్వేచ్ఛ

కమ్యూనిజం అనుభవించిన పరాజయాల్ని, ఘాతుకాల్ని కమ్యూనిజాని కంట గట్టాల్సిన అవసరంలేదు. పెడదారితొక్కిన తన కొడుకుల్ని చూసి దుఃఖంతో

పెగలని స్వరంతో బాధపడే తల్లి వంటిది కమ్యూనిజం. కొడుకుల తప్పుల్ని కాచుకోవడం తల్లి ప్రేమకెలా కొంతమేరకు అవసరమో వాళ్ళ తప్పుల్ని అవసరం మేరకు శిక్షించడం కూడా అంతే విధాయకం. రుమేనియాలోనైతే ప్రజలు తిరుగుబాటే చేశారు.

తప్పులు చేసినా వాటిని సరైన పాఠాలు నేర్చుకోడానికి ఉపయోగించుకోవడం గతి తార్కిక లక్షణం. అలాగే కమ్యూనిస్టు దేశాల్లో పొరపాట్లు జరిగితే నిరాశ చెందకుండా వాటివల్ల గుణపాఠం నేర్చుకొని ఆచరణలో ఇంకా ఉన్నతమయిన సమాజ దశకు చేరుకొనే ప్రయత్నం చేయడమన్నది వ్యక్తుల సమాజాల గతి తార్కిక కర్తవ్యం. ఒకవేళ పొరపాటు సరిదిద్దుకోలేక యాంత్రిక భావవాద ధోరణిలో తిరోగమిస్తే అది ఆయా వ్యక్తుల, దేశాలలోని లోపాలే కారణం కాని అవి గతి తార్కిక భౌతికవాదం లోపాలు కావు. దాన్ని స్వంతం చేసుకున్న వారికి అవి దారి దివిటీలు.

విప్లవాచరణకు విప్లవ సిద్ధాంతాన్ని, చైతన్యాన్ని మరింతగా ఒంటబట్టించుకొని ఇంకా ఉన్నతమైన ప్రాతిపదికపై నిలబెట్టుకొనే బదులు నిరాశ నిస్పృహల పాలబడి పాలక వర్గాల భావజాలమైన ఆధునిక అధి భౌతిక ప్రత్యయాలపై మోహంతో తిరోగమించడం కవిత్వం ప్రచురణలు వెలువరించిన కవులందరిలో సామాన్య లక్షణంగా కన్పిస్తున్నది.

ఈ తిరోగమనంలో భాగంగానే రూపం వస్తువుల మధ్యగల గతితార్కిక సంబంధం గురించిన అవగాహనలేక శిల్పాన్ని మాత్రమే కవిత్వమనుకునే కవులు ఆత్మాశ్రయ వైయక్తిక ధోరణినుండి ఎప్పుడూ బయటపడలేరు. అటువంటి కవి పాలక వర్గాల భావజాలాన్ని స్వంతం చేసుకొని వాళ్ళ ప్రయోజనాల్ని కాపాడటానికి కంకణం కట్టుకున్న అధికార కవుల కంటె కళాహీనమైన కవే. అయితే వర్గ సమాజంలో సామాజికత, సమానత్వం అన్న వాస్తవికతల గురించి అసలు పట్టించుకోని ఏ కవైనా ఈ ప్రమాదంలో చిక్కుకునే అవకాశం ఉంది. సామాజిక చైతన్యం పదార్థ చైతన్య గతితార్కిక రూపమే అయినప్పటికీ దాన్ని అనుక్షణం పరాయీకరణకు గురిచేస్తూ అభావం చేసే పాలక వర్గాల కుట్రనుండి బయట పడాలంటే గతితర్కాన్ని చదువుకోవాల్సిన అవసరమేమీ లేదు. నిజమైన శ్రామిక వర్గ

సీరియల్ నవల :

# రాగో

సాధన

(గత సంచిక తరువాయి)

## 3

రోజులు గడుస్తున్నాయి. రాగో మనసు ఓ పట్టాన నిలవడం లేదు. రక రకాల ఆలోచనలతో ఔద్ధత్యమానం ఎటూ పాలుపోని పరిస్థితి ఎదుర్కొంటుంది. ఎక్కడికి పోయినా, ఏ పరిచయస్తుల వద్దనైనా, చిన్ననాటి స్నేహితుల వద్దనైనా తల దాచుకోవడానికి పూట, అరపూట ఉండాల్సి వచ్చేసరికి అక్కడి వారంతా 'కేర్దే' (భర్తను వదలి మరో సంబంధం వెతుక్కునే ఆడది) అంటూ అదోరకంగా చూస్తుంటే దిన దిన గండంగా సాగుతుంది. ఏ కాలంనాడు ఏ పెద్దలు నామ కరణం చేశారో గానీ నేటికీ ఏ మాత్రం జంకు లేకుండా మొగం మీదే కేర్దే అని పిలుస్తూ భర్తను విడిచిన ప్రతి స్త్రీని వేధించడం ఒక ఆనవాయితీగానే వస్తుంది. ఈ మధ్యకాలం గడపడానికి తాను తిరుగుతున్న ఊర్లల్లో కొందరు యువకులు వెటకా రంగా వెంట పడుతుంటే, మరి కొందరు నిస్సంకోచంగా ఊరి పెద్దలతోనే నోత్తి (రాయబారం) పెట్టడం భరించరానిదిగానే ఉంటుంది.

మాడియా మహిళ తరతరాలుగా అనుభవిస్తున్న ఈ చిత్రహింసలు తెల్లారే దెపుడు అనేది ఆనాటికీ రాగోకు అర్థం కాని, పరిష్కారం లేని ప్రశ్నగానే మిగిలి పోయింది. రాగోకు హితోపదేశాలు, ఉచిత సలహాలు ఇచ్చేవారికి ఏం తక్కువ

---

పక్షపాతాన్ని, చైతన్యాన్ని పెంపొందించుకుంటే వాలు, ఆ కుట్రనుండి కవిత్వాన్ని, జీవితాన్ని రక్షించుకోవచ్చు.

ఈ రకమైన చైతన్యం నిరంతర పోరాటంలోనే నిగ్గుదేల్తుంది. ఆ పోరాట క్రమంలోనే, రూపంలో వస్తువులో లయ ప్రధానమైన కవిత్వం భవిష్యత్తులో ఏ రూపం తీసుకుంటుందో కూడ నిర్ణయమవుతుంది.

× × ×

లేదు. ఏ వయసుకు ఆ ముచ్చట ఉండాలని కొందరు మొగం పైనే అంటుంటే, ఎక్కడో దగ్గర జోడైతే సరిపోతుందని మరి కొందరు ఊరికే ఊదరగొడుతున్నారు. మరి కొందరు పుట్టింటి మర్యాదలు, తల్లి తరపు సంబంధాలు నిలబెట్టడానికి పుటుల్ వారికే పోతే మంచిదని అంటారు కొందారు సాంప్రదాయక పెద్దలు. వీరెవరికి రాగో మనసు తెలియదు. రాగోకు ఒక మనసుంటుందనే సంగతి వారు పట్టించుకోరు.

కర్దే ముద్ర క్రమంగా స్థిరపడిపోతుంటే తన తోటి నేస్తులు కూడ తేలిగ్గా చూస్తున్నారు. కన్నవారికి కొన్నవారికి దొరకకుండా రోజుల తరబడిగా గడపాలంటే కష్టంగానే ఉంది. ఎక్కడా పూటకేమి దొరకనపుడు, ఏ ఖేతుల్లోనయినా అదృష్ట వశాత్తు ఏతి కంటపడితే దానితోనే చాటుమాటుగా పొట్ట నింపుకొని తిరిగి అక్కడి నుండి ఎవరూ చూడకుండా ఉడాయించడం. ఇలా తిరుగుతుండడం అభిమానాన్ని చంపుకొని పొట్టకోసం చేసే నీచమైన పనులే అని మనసులో కుమిలిపోతూ ఉంటుంది. ఒకవేళ ఆ ఖేతుల్లో ఎవరైనా గడసువాళ్ళు వెంటపడితే తప్పుకోవడం సవాలుగానే ఉంటుంది. ఒకవేళ బలవంతంగా బలైపోవడమే తప్పకపోతే ఇన్నాళ్ళు ఇన్ని కష్టాలు పడుతూ అడవి పట్టుకొని తిరగడమూ, రేపేదో ఒక రోజు కోరుకున్న తీరుగా బతుకొచ్చుకదా అని ఎదురుచూడడం ఇదంతా దండుగ మారి తిప్పలే అవుతుంది కదా అనే రంధి నిత్యం వెంటాడుతుంది.

అలా ఒకనాడు విపరీతంగా ఆకలిగా వున్నపుడు ఎదురుగా కనపడ్డ ఓ ఖేతుల్లో చొచ్చింది రాగో. బోర్లేసి ఉన్న డూటి (వెదురు గంప)ని పక్కకు పడేసి గంజులో నుంచే గబగబా నాలుగు ముద్దలు నోట్లో కుక్కుతుంది. ఇంతలోనే బయట ఎవరో వస్తున్న అలికిడి అయ్యింది. ఒక్క గెంతులో బయటపడి అడవి దారి పట్టింది రాగో. ఆ వచ్చిన వారెవరో ఆమె చూడలేదు. కానీ ఆమె మాత్రం వారి కంటపడనే పడింది.

ఆ ప్రాంతం రాగో పుట్టిన వూరికీ, మేనమామల ఊరికీ మధ్యగా ఉంటుంది. అడవిలో పడ్డ రాగో వెనక్కి చూడకుండా చరచరా చెట్లు తుప్పలు దాటుకుంటూ లోలోపలికి పోతుంది. ఒంట్లో ఓపిక లేదు. పైగా ఆ నాటికి బహిష్టయి ఆఖరి రోజు. వాగులోకి దిగి బండల చాటుకు పోయి స్నానం చేస్తే బాపుండుననిపించి రాగో ఆ దారి పట్టింది.

రాగోను చూసింది ఆ వూరి వాళ్ళు కాదు. ఆమె మేనమామ, అతని కొడుకే. రాగో చేయిజారిపోయినప్పటి నుండి కసిగావున్న బావ ఆమెని ఖేతుల్లోంచి గెంటిన క్షణమే గుర్తుపట్టాడు. వెంటనే తండ్రి కొడుకులు కూడబలుక్కొని వచ్చినపని వదలిపెట్టి ఆ వూరి లెయ్యోల్లని (యువకులని) వెంటేసుకోని అడవిలో వెతకడం ప్రారంభించారు.

కంటపడ్డ జంతువునే వదలని వారికి ఈ ఆడదాన్ని పట్టుకోవడం ఒక కష్టమా? ఇంకేం. వేట ప్రారంభించారు. దొరక్కుండా ఎటు పోగలదనే ధీమాతోనే రాగో తండ్రికి కూడ కబురుపెట్టారు.

వారు జట్లు జట్లుగా విడిపోయి అడవంతా గాలిస్తున్నారు. చెట్లు, చేమలు, ఒర్రెలు, ఒంపులు ఏదీ విడవడం లేదు. చుట్టు వలపెట్టి జంతువును వేటాడినట్టే వెతుకుతున్నారు. ఏ పొదను విడవడం లేదు. వాగులో స్నానంచేసి గుడ్డలుతుక్కుంటున్న రాగో ఒక జట్టు కంట్లో పడనే పడింది. ఆ జట్టులోనున్న నలుగురూ ఒకరి కొకరు సైగలు చేసుకున్నారు. దాన్నెలా పట్టుకోవాలో కళ్ళతోనే మాట్లాడుకున్నారు. రాగో బావ ఆ జట్టులోనే ఉన్నాడు. పిల్లి అడుగుల్తో పిల్లను చేరుకున్నారు. ఆకుల అలికిడి కూడ కాకుండా జాగ్రత్తగా దగ్గరికి చేరుకున్నారు. తన ధ్యాసలో తానున్న రాగో పరాయి మగాడు మీదపడి చేయి పట్టేవరకు గమనించనేలేదు. తత్తరపడిన రాగో తేరుకునేసరికి బావతోపాటు మరో ముగ్గురు ఎదురుగా ఉన్నారు. పట్టుబడ్డ పిట్టలా వణవణ వణుకుతున్న రాగోను చేతులు విరిచికట్టి వెంటనడిపించుకుంటూ ఈడ్చుకుపోయారు.

ఊరు చేరుకున్న రాగోను గోటుల్ ముందు నిలబెట్టారు. ఊరి జనాలందరూ అక్కడ గుమిగూడారు. వియ్యంకుల కబురు అందుకొని వచ్చిన రాగో తండ్రి కూడ ఆ గుంపులో ఉన్నాడు. పిల్లలు వింతగా చూస్తుంటే తిట్టేవాళ్ళు తిడుతున్నారు. వెక్కిరిచ్చేవాళ్ళు వెక్కిరిస్తున్నారు. పిల్ల పంచాయితి మొదలయ్యింది రాగో మామ నోటికొచ్చినట్టు తిడుతున్నాడు. దెబ్బలు కొట్లతో కమిలిపోయిన రాగో ఒళ్ళంతా పుండులా సలుపుతుంది. ఆ రాత్రికే పెళ్ళి జరిపించాలని ఇంట్లో అన్ని ఏర్పాట్లు చేస్తున్నారు. మంది మధ్యలో తలవంచుకుని నిలబడ్డ రాగో సగం ఏడుపు సగం మాటలుగా "నేను వానికి పోను" అని గొణగడం తప్ప మరో మాట అనడం లేదు.

'ఎప్పటికైనా నీ ఇంటికివ్వాల్సిందే. నువ్వు ఏం చేసుకుంటవో నీ యిష్టం' అన్నట్టు మెదలకుండా కూచున్నడు దల్సు. అ తండ్రి చేసేది అంతే. అతడు అడుకుంటాడనే ఆశ రాగోకి లేదు. తండ్రి చేతికే దొరికినా తనని ఈ వూరికి తెచ్చి అప్ప జెప్పేవాడే. అప్పుడయినా జరిగే తంతు ఇదే. రాగో మామ మాత్రం "ఇవ్వాళ దొరికింది పోరి. ఇక నా తిప్పల తప్పింది" అన్నట్టు ధీమాగా తెగ వాగుతున్నాడు. ఈ రాత్రితో రాగో తనది కాబోతుందని రాగో బావ మాత్రం తెగ మురిసిపోతున్నాడు.

అనాడు గది నుండి బయటపడడానికి కూచిని బోల్తా కొట్టించగలిగింది. మరి ఈ రోజు ఏ కూచి దొరుకుతుంది? ఈ నరకం నుంచి తాను బయడపడుతుందా? మేకపిల్లలా బలై పోవలసిందేనా? తన బతుకు ఏం కానుంది ? గోటుల్ ముందు అందరి మధ్యలో నిల్చున్న రాగో బుర్రలో, అడవి మండుతూంటే వెదుర్లు ఫట్ ఫట్‌మని పేల్తున్నట్లు అంతా గందరగోళంగా ఉంది.

చీకటి పడగానే అమ్మలక్కలు తలంటిపోసి గదిలోకి తోస్తారు. అ రోజున పెళ్ళి అంటే అదే....బలవంతంగా చేయాల్సివస్తే గొప్పైవాదలు పాటించే తంతే అంత. అ పూట ఊరివాళ్ళకు చేయి కడుగుతారు. కొంత కల్లు పోస్తారు. రాగో మామ వంటల వద్ద ఉన్నాడు. రాగో బావ హుషారుగా తోటివాళ్ళతో అటిటు తిరుగుతున్నాడు. రాగో అత్త శేడోలను పిలుచుకుంటూ రాగోకు తలంటిపోయడానికి ఏర్పాట్లు చేస్తుంది. అంతటా చీకటి. నెగడు వెలుతుర్లోనే పనులన్నీ సాగుతున్నాయి. మరో గంటలో రాగోను గదిలోకి తోస్తారు. రక్కినా, గిల్లినా, ఏడ్చినా, తన్నినా, తన్నులు తిన్నా చివరికి రాగో బావకి దొరక్కుండా ఉండగలదా! అనాడెంత అల్లరైనా సరే ఊరంతా అదో సరదాగా అనందిస్తారే తప్ప 'అయ్యో' అనే వాళ్ళే ఉండరు.

శేడోలు రాగోకు తలంటిపోస్తున్నారు. ఒంటికి పోతానని చెట్లచాటుకి పోయిన రాగో ఎంతకీ తిరిగిరాలేదు. చేతుల్లో పసుపుముద్దలు, నీళ్ళముంతలతో ఎదురు చూస్తున్న శేడోలు పిలుస్తున్న అరుపులూ పెళ్ళి ఇంట్లో చెలరేగుతున్న గందరగోళమూ రానురాను దూరమౌతుంటే తడి బట్టలతో గజగజలాడుతూ రాగో మళ్ళీ అడవి కడుపులోకి దూరుకుంది.

అత్తగారింటి నుండి బయటపట్ట రాగోకు పెద్దగండం గడిచినట్టయింది. కానీ మళ్ళీ ఇలా జరక్కుండా ఏంచేయాలి ? ఎక్కడికి పోవాలి ?

కాళ్ళకి అడ్డం పడుతున్న తడికుచ్చెళ్ల రొంటిన చెక్కి పరుగులంకించుకుంది. మినుకు మినుకుమని చుక్కలు దిక్కులు చూపెడుతున్నా దిక్కుతోచని రాగోకి వాటితో పనేలేదు. వెళ్ళరాని దిక్కల్లా ఒక్క తల్లిగారిల్లు, అత్తగారిల్లే. అటుగా కుండా ఏటుపోయినా ఒకటే. అయినవాళ్ళకు అందకుండా అవస్థలన్నీటికీ దూరంగా పారిపోతే చాలు. అల్లకల్లోలంగా ఉన్న ఆలోచనల్లాగే ఆగకుండా పరిగెడుతుంది రాగో. పడుతూ, లేస్తూ దొడ్డ (వాగు) దాటినా, రోడ్డు దాటినా గడ్డ ఎక్కి ఆగకుండా పరిగెడుతూ తీగతట్టుకొని తూలి ముందుకు పడబోయి చెట్టును అందుకుని తమాయించుకుంది.

చెట్ల సందుల్లో నుండి పడుతున్న మసక వెలుగులో రాగో ఆ మద్ది చెట్టును ఆనుకొని కూలబడిపోయింది. నడిచే ఓపిక, శక్తి లేదు. నిద్ర కమ్ముకొస్తుంటే బలవంతంగా ఆపుకోవడానికి తిప్పలు పడుతూంది. అందనంత దూరం వచ్చేసింది గానీ ఎలుగుబంట్లు, పెద్దపులులు వస్తాయనే భయంతోనే ఆ అవస్థ. కానీ తెల్లవారు జాము చల్లగాలి తనకు తెలియకుండానే గాఢ నిద్రలోకి లాగేసింది.

## 4

పెద్ద బండను మీదికి దొబ్బినట్లై రాగోకు ఠిగ్గున తెలివైంది.

బండలు దొర్లిస్తున్నారు. గడ్డపారలతో బలంగా తవ్వుతున్నారు. గొడ్డళ్ళతో నరుకుతున్నారు. ఒకరూ, ఇద్దరూ కాదు. వూరికి ఊరే మీద పడ్డట్టుంది. లో గొంతులో గుసగుసలుగా మాట్లాడుతున్నారు. ఆ అల్లరీ, హడావిడి అంతా దగ్గర్లోనే వినబడుతూంది.

లేచిందీ లేచినట్లే మద్ది చెట్టును పొదువుకుంది రాగో.

ఎవరై ఉంటారు ? ఏమిటి అల్లరి ? ఏం చేస్తున్నారు ? తననే వేటాడుతున్నారా ? తాను ఎక్కువ దూరం పరుగెత్తలేదా ? దార్లోనే మొద్దునిద్ర ముంచు కొచ్చేసిందా ? ఇప్పుడు తన పుట్టి మునిగిందా ? అనుకుంటూనే చెట్టుచాటు చేసుకొని ఆ అలికిడి దిక్కు కలి మజూడసాగింది.

'ధాం ! ధాం' అంటూ ఒకేసారి తుపాకులు పేలాయి. ఏం జరిగిందో అర్థం

చేసుకునే లోపునే ఆ జనం పరుగు లంకించుకున్నారు. తన వైపే ఉరికివస్తున్న గుంపు కన్పించింది. మసక వెల్తురులో వాళ్ల వేగంగా పరిగెడుతున్నారు. మొసతో ఉరుకుతూ తనని దాటిపోతున్నారు. వెనకబడిన స్త్రీలను 'సాండే - సాండే' (తొందరగా) అంటూ తొందరచేస్తూ బలంగా అడుగులు వేస్తున్న దాదలను స్పష్టంగా చూసింది రాగో.

తనకు తెలియకుండానే ఆ స్త్రీల వెనుకే పరిగెట్టింది రాగో కూడ.

వెనుక నుండి ఖాకీ డ్రసులు అరుపులు, తిట్లూ గాలిలో దూసుకవస్తున్నాయి. గాలిలో కలసిపోతూ ఆ అరుపులు దూరమవుతుంటే అదేమీ పట్టించుకోకుండా గుంపు ముందుకురికింది. రాగో గుంపులో కలసింది.

భళ్ళున తెల్లారింది. ఒకరికొకరు స్పష్టంగా పోల్చుకుంటున్నారు. కొత్త ముఖం కనపడేసరికి వెనక్కివచ్చే స్త్రీలు గతుక్కుమన్నారు. రాగో కూడ వారిని భయం భయంగానే చూస్తుంది. అంతా కొత్తే అయినా మాడియా అక్కలే కదా ! అన్నట్టుంది.

"దాదా ! హే దాదా ! రోమట్, రోమట్" (ఆగండి) అంటూ రాగో పక్కన నడుస్తున్న ఓ స్త్రీ ఠక్కున ఆగి ముందువాళ్ళను కేకేసింది.

"కెమ్మెనే" (మెల్లగా) అంటూ మరో స్త్రీ వెనుదిరిగింది. మొత్తం గుంపు ఆగిపోయింది.

'ఇద్ బద్ బాయి ! బగటదు అందు ! బోన సంగెవాత్త !' (ఈమె ఎవరు, ఎక్కడిది. ఎవరితో వచ్చింది) అంటూ రాగో ముఖం చూస్తూ ఒక్కసారే గడగడ ప్రశ్నలు వేసింది.

వాళ్ళ నాయకుడికూడ 'రాగో' ఎవరో తెలియడం లేదు. తన వెంట వచ్చిన వాళ్ళలో ఈ ముఖం లేదే !' తనలో తాను అనుకుంటునే 'ఎక్కడైనా చూసి ఉంటారా' అన్నట్టు ప్రశ్నార్థకంగా పక్కవాళ్ళ వంక చూశాడు. ఆయన ఆలోచనల్ని గమనించినట్టు మరో కంఠం 'బద్‌నార్ సీవా' (ఏ ఊరు నీది) అంటూ రాగోనే ప్రశ్నించాడు.

రాగో బిత్తరపోయి నేల చూపుల చూడసాగింది.

'బాత పారల్ బాయి'? (ఏం పేరు) 'వెహా బాయి' (చెప్పు అక్క) అంటూ మరో స్త్రీ బుదగరించినట్లడిగింది.

'రాగో'

'కేర్దే బహ'- అన్నారెవరో గుంపులోనుండి.

'కల్‌మట్' (నవ్వకండి) అంటూ గుంపు లీడర్ గట్టిగా అనేసరికి అందరు నిశ్శబ్దంగా ఉండిపోయారు.

'దట్! దట్! దాకద్! ఉసిరికీమట్' (పద, పద, పోదాం, ఆలస్యం చేయ వద్దు) అంటూ ఆ గుంపులోని నడివయస్కుడు తొందర చేయసాగాడు.

'ఇంగో' అన్నారెవరో గుంపు కదిలింది.

రాగో కూడా వారితోనే నడుస్తుంది.

'బద్‌నార్ అక్కా' (ఏ వూరక్కా) అంటూ మాటకలిపిందొక స్త్రీ. ఏం చెప్పాలో తోచడంలేదు. తన సంగతంతా చెప్పితే ఎట్లా ఉంటుందో అనుమానం పీకుతుంది. పసుపు బట్టల రాగో వాలకం గుచ్చిగుచ్చిచూస్తూ ఆ పడుచు అడిగే ప్రశ్నల్ని తప్పించుకోవడం రాగోకి సాధ్యం కావడంలేదు.

'మా లోను వాంతినా' అన్న మరో పడచు వైపు చూసి 'ఇంగో' అంటూ రాగో ఆమె దగ్గరికి చేరింది.

అందరూ వడివడిగా అడుగులు వేస్తున్నారు. నీళ్ళు కలసిన దగ్గర ఇన్ని మింగి మరిన్ని ముఖాలపై చల్లుకుంటున్నారు. కళ్ళు పీక్కుపోయి ఉన్నాయి. ఎవరికీ నిద్రలేదన్నది వారి వాలకాన్ని బట్టి అర్థమవుతుంది. కొందరు నడుస్తూ నడుస్తూనే తూగుతున్నారు.

వాళ్ళ అందరి చేతుల్లో ఏదో ఒక ఆయుధం ఉంది. గొడ్డలి, బరిసె, పార, గునపంలతోపాటు కొందరి చేతుల్లో బర్మార్లుకూడా ఉన్నాయి. వాళ్ళెక్కడినుంచి వస్తున్నారో, ఏం చేసి వస్తున్నారో రాగోకు అంతు చిక్కడంలేదు. రాగో యిక ఉండ బట్టలేక తన్ను పిలుచుకున్న 'రూపి'నే చిన్నగా కదిలించింది.

'బేకహంజి' (ఎక్కడినుండి) అంటూ మెల్లగా అడిగింది. ఆవిడ పేరు 'రూపి' అని తెలుసుకున్నా పేరుపెట్టి అడగడానికి యింకా ధైర్యం చేయలేదు.

తాము చేసిన పని గూర్చి మనసులోనే గొప్పగా మాటాడుకుంటున్న రూపికి రాగో ప్రశ్నతో కట్టలు తెగినట్టయింది. అంతే అడిగింది తడవుగా రూపి చకచకా రాగోతో పూసగుచ్చినట్టు అన్నీ చెప్పసాగింది.

"ఊళ్ళల్ల పోలీసుల నిర్బంధం రోజురోజుకు ఎక్కువైతుందనీ, జైల్లోపడ్డ

మనోళ్ళని విడిపించుకోవాలనీ ఒకరోజు జిల్లా అంతా సంపు చేయాలనీ 'దాదలు' చెప్పింద్రట. ముందటున్న 'సీర్కాల్' దాద మాకు చెప్పిండు. చెట్లు నరకాలనీ, బొందలు తవ్వాలనీ, రోడ్డుమీద పోలీసుల జీపులు, కార్లు నడవకుండా చేయాలనీ అన్నాడు. ఇంటింటినుండి అందరూ రావాలనీ గోటుల్ కాడ మీటింగ్ చేసి చెప్పిండు. ఎవల 'హతియార' (ఆయుధం) వాళ్ళే తెచ్చుకోవాలన్నాడు. ఇయ్యాల మన జిల్లా గడచిరోలి అంతా ఎక్కడికక్కడే అన్నీ పనులు బంద పెడుతున్నారని చెప్పితే మేంకూడా మా ఊళ్ళె 'పోల్వ' తీరుచేసి పనికి ఎవరం పోలేదు. సీర్కావి వెంబడి బర్మార్ పట్టుకున్నోడు మా అన్న. వాళ్ళు రోడ్డుమీద పోలీసులు రాకుండా సెంట్రీ చేస్తుంటే ఒక్కసారే ఢాం, ఢాం అంటూ బర్మార్లు కొట్టి ఊరికి వచ్చి మమ్మల్ని హుషారు చేయంగానే ఇక మేమందరం ఎగపడ్డం". అంటూ కిల్లర కిల్లర నవ్వ సాగింది.

మాటలు కలవడంతో మనసులోని రంధి వెనక్కిపోయి రాగోకూడా నవ్వులో కలసింది.

'కెమ్మెన్ డీ' (మెల్లగనే) అంటూ ముందున్నవారెవరో బిగ్గరగా అనడంతో రూపి-రాగోలు గమ్మునయిపోయారు.

అందరూ ఆగిపోయారు. ఎక్కడివాళ్ళక్కడే చెట్ల వెనక నిల్చుండిపోయారు. అలికిడి లేకుండా పరీక్షగా ముందుకి చూస్తున్నారు. ఎదురుగా ఉన్న పొలాల్లోనుండి ఇద్దరు స్త్రీలు వచ్చి సీర్కాల్‌తో ఏదో గుసగుసగా చెప్పారు.

"'కామ్రేడ్స్'! మా ఊరికి ఇప్పటికీ పోలీసులు ఎవరూ రాలేదట. మేము ఇక్కడ ఆగుతున్నాం. మీరు మీ మీ ఊళ్ళల్లకుపోండి. హుషారుగానే పోవాలి. అడవి అడవి పోవాలెగానీ సడకు పట్టవద్దు. ఊళ్ళకు పోయేముందు మంచి చెడ్డ అడిగి ఊళ్ళకు చొర్రాలిగానీ ఎకాఎకి పోకుండ్రి. నేను ఆ వెనుక కలుస్తా" అంటూ బిగిసిన పిడికిలి లేపడంతో అందరూ ప్రతిగా 'లాల్‌సలాం' చెప్పి కదిలారు.

'బద్ నార్ బాయి' అంటూ రాగో అడగడంతో 'మోరుస్కే' అని రూపి బదులు చెప్పింది.

'బద్ పట్టీ అక్కా' అంటూ ఎన్నడూ వినని కొత్త ఊరు గూర్చి అను మానంగా అడిగింది.

'సూర్జాఘడ్ పట్టీ' అంటూ బదులు ఇచ్చిన రూపి తమ ఊరు మర్కనార్ మరో మైలు దూరంలో ఉన్నట్టు చెప్పింది.

×× ×× ××

రూపి ఇంట్లో తనకేమిలోటు లేకపోయినా ఎందుకోగాని విడిగా ఉండాలనే మనసు కోరుకుంది. 'విడిగా ఉంటేనేం. రూపిని విడిచే ప్రసక్తేలేదుగా అన్న ధైర్యంతో తన వంట తాను చేసుకుంటూ కూలినాలి చేస్తూ విడిగా ఉంటూనే కాలం వెళ్ళబుచ్చుతుంది రాగో. రూపి తనకు వచ్చిన పాటలన్నీ రాగోతో పాడిస్తుంది. తను విన్న మాటలన్నీ గుర్తున్న మేరకు రాగోతో అనిపిస్తుంది. క్రమంగా ఇద్దరి మధ్య స్నేహం గట్టిపడుతూ తెలియకుండానే ఇరవై రోజులు గడచిపోయాయి. గతాన్ని తవ్వి తీసే బాపతు ఎవ్వరూ తారసపడకపోవడంతో రూపి ఉన్నంత వరకు భయపడాల్సిన అవసరంరాదనే ధీమాతో రాగో క్రమంగా కలతదీరి బతుకుమీద భరోసా పెంచుకుంది.

అపుడపుడు సీర్కాల్ కూడ వచ్చి మీటింగ్ పెట్టిపోవడం మరింత ధైర్యం పెరగడానికి ఉపయోగపడుతుంది.

వంటపనిలో మునిగిపోయి కూనిరాగాలు తీస్తున్న రాగో, రూపి పిలుపుతో ఒక్కసారే తేరుకుని 'బాతల్' అంది.

"పక్కూల్లో పంచాయితి ఉందట. సీర్కా దాద రమ్మని చెప్పిండు పోదాం. జెల్ది జువ్వడిను" అంటూనే తుర్రుమన్న రూపి మాటవిని రాగో సంబరపడింది. త్వరత్వరగా పనులు ముగించుకొని అన్నం తినేసి రాగో రూపి వద్దకుపోయింది.

'వాత్తినా అక్కా' (వచ్చినవా అక్కా) అంటూ అప్పుడే అక్కడికి వచ్చిన సీర్కా దాద చనువుగా పలకరించాడు.

'ఇంగో'! రాగో

"హూడా అక్కా! (చూడు అక్కా) మనం ఒక్క వారం రోజులు ఈ చుట్టు పక్కల ఊర్లు తిరిగి సంఘం మీటింగ్‌లు పెట్టి జంగ్లాతుసంపు (సమ్మె) గూర్చి ప్రచారం చెయ్యాలనీ 'దాదలు' చెప్పంపారు మాతోపాటు నువు రాగలవా" అంటూ తను వచ్చిన పనేదోచెప్పి 'రూప కూడ మనతోనే ఉంటది' అనడంతో రాగో ధైర్యంగా 'ఇంగో' అన్నది.

ఊరూరు తిరగడం, పాటలు పాడటం, మీటింగ్‌లు పెట్టడం ఊరి వాళ్ళ పంచాయితీలు తష్లా చేయడం, గోడలకు కాగితాలు అంటించడం, ఆ కాయితాల్లో ఉన్నది వినిపించడం మొదలైన పనులతో పొద్దు తెలియకుండానే వారం రోజులూ

ఒక్క రోజులో గడచినట్టయ్యింది. రాగోలో నూతన ఉత్సాహం మరింత పెరగ సాగింది.

రాగో ఉంటున్న ఇంటావిడ సహజంగానే రాగో హుషారైన పిల్లా అని అర్థమై సంబరపడసాగింది. రూపతో స్నేహం చేస్తూ చలాకిగా తిరుగుతున్నందుకు మరీ సంతోషించింది. తనకు కూడ ఇంట్లో చిన్న పనికి, పెద్ద పనికి ఆసరా అవుతుంది. ఈడుమీద ఉన్న పిల్ల. అన్నీ బాగున్నాయి కానీ రూపతోపాటు వెంబడి సంఘం, సంఘం అంటూ తిరగడమే ఆవిడకు నచ్చనిది. అయినా తన మరిదికి పరిపోతుంది. వాడికి అంటగడితే ఏ చిక్కూ ఉండదు. ఊరూరా తిరిగే తిప్పల తప్పుతుంది. అని మనసులో పొద్దస్తమానం గింజుకోని చివరకు ఒకనాడు ఉండబట్టలేక ఆవిడ రాగోనే అడిగేసింది.

అంతే ! రాగో ఇల్లు ఖాళీ చేసి మరో చోట మకాం ఏర్పాటు చేసుకుంది. మరోసారి అలాంటి పిచ్చి మాటలు ఎత్తితే రూపక్కకు సీర్క దాదాకు చెప్పి పంచాయితీ చేయిస్తానని బెదిరించడంతో ఆ తల్లి దవడలు దగ్గరపడ్డాయి.

రాగో ఆ ఊరు వచ్చి రెండు నెలలయింది. ఏ నోట విన్నా 'దాదలు, దాదలు' అంటూ ప్రతి దాన్లో అన్నల ప్రసే వింటున్నది తప్ప యింతవరకూ వారిని చూడ లేదు. ఏ పని చేసినా అన్నలని చూడాలన్న ఆతురత వెంటాడుతూ ఉండేది.

చేతిలో కుండతో నీళ్ళకు పోయిన రాగోకు ఎదురుగా పెద్ద గుంపు రావడంతో ఆశ్చర్యమేసి, 'ఎవరబ్బా' అనుకుంటూ కుండ అక్కడే వదిలేసి రూప దగ్గరికి దౌడు తీసింది.

'రూపి ! ఏయ్ రూపి' — రాగో.

"ఇంగోరి ! బాత కల్ల" (ఏమే ఏమల్లరి) — రూపి

"సీర్క దాదల్, ఇంకా చాలామంది కలసి ఎవరినో కొడుతున్నారు. గోటుల్ దిక్కు కొంటపోతున్నరు. నడువు, నడువు. నేను పోతున్నా" అంటూ రాగో హడావిడిగా వచ్చినట్టే వెళ్ళిపోయింది.

గుపికి, గుపికి గుద్దులు, తన్నులు గుతుపలు నాట్యమాడుతున్నాయి. పిల్లా, పెద్ద అంతా కలసి 50-60 వరకు ఉన్నారు. మోడుస్కీ వాళ్ళకూడ వచ్చింద్రు అని గుర్తించింది రాగో. ఆ తన్నులు తింటున్న వాడెవడో చూడడానికి చుట్టు చుట్టు తిరిగినా సందు లేకుండా ఉంది. గుంపులో నుండి ఎవరో 'ఉదట్' ఉదట్'

(కూచోండి) అంటూ ఎంత గోల చేస్తున్నా పట్టించుకోక పోవడంతో చివరికి సీర్కా-దాద ఒక్కొక్కరి రెట్ట పట్టి కూచుండబెట్టాడు. అల్లరి సద్దుమనగసాగింది.

'హమ్మయ్య' అంటూ మొస తీసుకున్న రాగో గుంపు నడుమ నిల్చోని తన్నులు తింటున్న వాడిని చూసేసరికి వాడి పక్కనే చేతిలో గుతుపతో రూప అక్కడ ప్రత్యక్షమయ్యింది. 'అమ్మదొంగ' ఇదెప్పుడు చేరిపోయింది ? అంటూ ఒక్క ఉదుటున ఉరికి రూపి చేతిలోని కర్ర పుచ్చుకుంది రాగో.

"కామ్రేడ్స్!" అంటూ సీర్కా విషయం మొదలు పెట్టాడు.

"వీడు జంగలోడు! గార్దు మనం సమ్మె చేసుడు వీనికి గిర్తలేదు. వీడు ఇక్కడ మనతో ఉన్నట్టె ఉంటూ అన్నీ రేంజర్‌కు అంటిస్తున్నాడు. చిట్టీలు రాసి పోలీసులకు పంపిస్తున్నాడు. సంఘపోల్లను పట్టిస్తానని కూడ అంటున్నాడట. ఇవన్నీ మనకు తెల్సినయ్. ఈ బద్మాష్‌గాన్ని ఏం చేద్దాం! చెప్పండి" అంటూ అందరినీ అడిగి రూప, రాగోల దిక్కు చూశాడు సీర్కా.

"హౌకట్! నై దున్" (చంపండి కుక్కను) అంటూ రాగో కర్ర లేపింది.

"మన్-మన్" (ఆగాగు) రూప వారించింది.

"వీడూ మన గొట్టోడే. బుద్ధి గడ్డి తిని గాడ్డి కొడుకు జంగలోని నౌకరి చేస్తుండు. మొత్తుకుంటే వినకపాయె. పోలీసు నౌఖరి, జంగలోవి నౌఖరి వద్దు బిడ్డా అంటే ఈ పొరగాండ్లు పట్టించుకోరు. మన కంట్లె మన వేలు పట్టుడు మంచిది గాదురా అంటే సమువుకున్నోదెవ్వడూ తెడ్డా మీ ముసలోల్ల మాట ఇనేది అని ఎనుక ముందు సూడకుండ పోయి పున్స పున్స భర్తీ కాబటి) సావనీ లంజకొడుకులు" అంటూ ఓ ముసలి పెద్దమనిషి కోపంతో చేతికర్రను నేలకేసి గట్టిగా పొడిచాడు.

"ఈతూకు (ఈసారి) ఇడిసిపెట్టి సర్కార్ పంచన పోనని ముక్కు భూమికి రాయిస్తే సరి" అంటూనే 'ఈ సర్కార్ లంజకొడుకులు కూడ ఇంకే నౌఖరి లేనట్టు మా మాడియోల్లందరిని గీటికీ పిల్వబట్టిరి. నీ అక్క. బుడ్డహౌకిరి" అంటూ అటు విరుచుకపడ్డాడు.

అక్కడున్న వారందరూ ఆ ముసలాయన తీర్పుకు 'ఇంగో' అన్నారు. సీర్కాల్‌తోపాటు రాగో, రూపలు ముందు నిలబడి ఆ తీర్పు అమలుచేశారు.

(ఇంకా వుంది)

వ్యాసం :

# సైన్స్ ఫిక్షన్ చిత్రాలు : సాంస్కృతిక ఫాసిజం

రావ్

"సంస్కృతి కోసం జరిగే పోరాటం వర్గపోరాటంలో అంతర్భాగమే" వి.జె. జెరోమ్

తెలుగు చిత్రాలకు ఫార్ములా ఉన్నట్టే విదేశీ చిత్రాలకు కూడా ఫార్ములా ఉంది- అయితే ఈ ఫార్ములా ఎప్పటి కప్పుడు ఆధునిక సామాజిక జీవనంలో వస్తున్న పరిణామాలను బట్టి మారిపోతూ ఉంటుంది. ఇప్పుడు హాలీవుడ్ కొత్త ఫార్ములా సైన్స్ ఫిక్షన్.

తొలినాటి సైన్స్ ఫిక్షన్ చిత్రాల లక్ష్యం వైజ్ఞానిక దృక్పథం కలగడానికి దోహదం చేయడమైతే ఆధునిక సైన్స్ ఫిక్షన్ చిత్రాల లక్ష్యం అందుకు సరిగ్గా విరుద్ధం-

"ది టైమ్ మెషిన్", "2001: ఎ స్పేస్", ఒడిస్సీ "ది ఫెంటాస్టిక్ వాయేజ్" వంటి ఆనాటి చిత్రాలు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఆధునిక విజ్ఞాన శాస్త్రం పట్ల ప్రేక్షకులలో ఎంతో ఆసక్తిని పెంచాయి. భవిష్యత్ శాస్త్రీయ దృక్పథం విస్తృతికి ఇటువంటి తొలినాటి సైన్స్ ఫిక్షన్ చిత్రాలు చక్కటి బాట వేశాయి. ఇటీవలి "స్టార్ వార్స్" మార్కు సైన్స్ ఫిక్షన్ చిత్రాలు మాత్రం సాంస్కృతిక ఫాసిజానికి వ్యక్తీకరణలుగా ప్రేక్షకుల ముందుకు వస్తున్నాయి. ఇది ఆకస్మికంగా జరిగిన పరిణామం కాదు.

సైన్స్ ఫిక్షన్ చిత్రాలకు, సైన్స్ ఫిక్షన్ సాహిత్యానికీ చాలా సన్నిహిత సంబంధం ఉంది. వైజ్ఞానిక కాల్పనిక సాహిత్యం ఈ శతాబ్దంన్నర కాలంలో ఆవిష్కరించిన వైజ్ఞానిక దృక్పథానికి ప్రతిఫలనంగా తొలినాటి వైజ్ఞానిక- కాల్పనిక చిత్రాలు వచ్చాయి. వాటిలో చెప్పుకోదగింది "ది టైమ్ మెషిన్".

హెచ్. జి. వెల్స్ రాసిన "ది టైమ్ మెషిన్" అసంఖ్యాకమైన శాస్త్రజ్ఞులనే తయారు చేసిందంటే అతిశయోక్తి కాదు. ఇందులోని ప్రధాన ఇతివృత్తం "కాలం కొలత"లో మనిషి భూత, భవిష్యత్ కాలాల్లోకి ప్రయాణించడం (అనునిత్యం మనం

వాడే "ప్రయాణం" అనే మాట స్థలం కొలతకు సంబంధించినది.) ఈ జగత్తుకు మూలం స్థల, కాలాలు. ఈ విశ్వంలో ఏమి జరిగినా ఈ రెండు కొలతలలోనే జరగాలి. అతి చిన్న పదార్థ శకలంలో సంభవించే ఎటువంటి మార్పు అయినా ఈ రెండు కొలతలలోనూ విధిగా జరగాలి. అణువిచ్ఛేదన జరిగినప్పుడు సైతం ఆ అదుపు "పరిణామం" ఎంతో కొంత ఉంటుంది; ఆ విచ్ఛేదన జరగడానికి అత్యల్పమే అయినా ఎంతో కొంత "సమయం" పడుతుంది!

ఇంతటి విడదీయరాని అనుబంధం స్థల, కాలాల మధ్య ఉన్నప్పుడు ఒక్క "స్థలం" కొలతలోనే ఏమిటి; "కాలం" కొలతలో ఎందుకు ప్రయాణించకూడదు? అద్భుతమైన ఈ వూహే అపూర్వమైన "టైమ్ మెషిన్" నవలకు మూలం.

ఇందులోని ప్రధాన పాత్రధారి భూత, భవిష్యత్ కాలాల్లో ప్రయాణించి గత సమాజాలను, భవిష్యత్ సమాజాలనూ దర్శించి వర్తమానంలోకి తిరిగివస్తాడు.

ఈ నూరేళ్ళలో "టైమ్ మెషిన్" (1895)ను తయారుచేయలేకపోయారు గాని కాలం కొలతలో ప్రయాణించడం అన్న ఒక్క వూహ మాత్రం అప్పటి నుంచి ఇప్పటివరకు శాస్త్రజ్ఞులకు ఎనలేని ఉత్సాహాన్ని, ఉత్తేజాన్నీ ఇస్తూనే ఉంది. ఈ నవల ఆధారంగా వచ్చిన "టైమ్ మెషిన్" సినిమా కూడా సాధారణ ప్రేక్షకులకు సైతం పాపులర్ సైన్స్ పట్ల అభిరుచిని పెంచింది.

ఆధునిక వైజ్ఞానిక పురోభివృద్ధికి సంబంధించి మొట్టమొదట చెప్పుకోవలసిన రచయిత ఆర్థర్ సి. క్లార్క్. సైన్స్ ఫిక్షన్ సాహిత్యం, సైన్స్ ఫిక్షన్ చిత్రాలు, సైన్స్ సాధించిన అనేక విజయాలకు ఆయువు పట్టు ఇచ్చినవి క్లార్క్ రచనలు. ఆధునిక సమాజ నడవడికను విప్లవాత్మకంగా మార్చేసిన ఉపగ్రహాలు మొట్టమొదట వూపిరి పోసుకుంది ఈ క్లార్క్ వూహలలోనే. (ఎంతటి దూరాలనైనా టెలిఫోన్ ద్వారా "దగ్గర" చేస్తున్న ఉపగ్రహ సమాచార వ్యవస్థే, దురహంకారంతో అమెరికా ప్రకటించిన గల్ఫ్‌యుద్ధాన్ని కూడా కోట్లాది టి. వి. ప్రేక్షకుల ముంగిట యథాతథంగా ప్రసారం చేసింది.)

ఆర్థర్ సి. క్లార్క్ రాసిన "2001 : ఎ స్పేస్ ఒడిస్సీ" భవిష్యత్ రోదసీ యాత్రలకు వూహాత్మక నేపథ్యాన్ని కల్పించింది. ఆ తర్వాత ఇదే పేర వచ్చిన చిత్రం ప్రేక్షకులకు అపూర్వమైన అనుభవాన్ని ఇచ్చింది. ఈ అనంత విశ్వంలో

అతి చిన్నదైన సౌర కుటుంబంతో, ఒక గ్రహంపై, అత్యంత నాటకీయమైన పరిస్థితులలో ప్రాణం పోసుకున్న కోట్లాది జీవరాశులలో ఒకానొక ప్రాణి అయిన మనిషి చలన సూత్రాలను గ్రహించి వాటి సహాయంతో సాధిస్తున్న ఘనవిజయాలకు ప్రతీకగా ఆ చిత్రం ప్రేక్షకుల ముందు నిలిచింది.

ఈ చిత్రం అంతరిక్ష యాత్రలపట్ల ఆసక్తిని పెంచడమే గాక సినిమా నిర్మాణంలో 'స్పెషల్ ఎఫెక్ట్స్'ని కూడా ప్రవేశపెట్టింది. అంతటితో చలనచిత్ర కళ స్వరూపమే మారిపోయింది. అలాగే క్లార్క్ రచనలవల్ల ఆధునిక సమాజ "గతి" కూడా ఒక్కసారిగా అనూహ్యంగా మారిపోయింది. ఉపగ్రహాల గురించి క్లార్క్ చేసిన వూహల ప్రాతిపదికగానే సోవియట్ యూనియన్ 1957లో 'స్పుత్నిక్' ను, అమెరికా 1958లో 'ఎక్స్‌ప్లోరర్'నూ ప్రయోగించాయి

అయితే ఆ తర్వాత అడపా దడపా వచ్చిన సైన్స్ ఫిక్షన్ చిత్రాలు ప్రధానంగా అప్పటికే మనిషి సాధించేసిన విజయాలను నేపథ్యంగా స్వీకరించాయి. మానసిక శాస్త్ర పరిశోధనలు విస్తృతి పెంచుకుంటున్న దశలో వచ్చిన "ది ఫెంటాస్టిక్ వాయేజ్" మనిషి శరీరంలో మనుషులే ప్రయాణించే విచిత్రమైన వూహకు కళాత్మక రూపాన్ని ఇచ్చింది.

ఒక రోగికి శరీర అంతర్భాగంలో ఒక నిర్దిష్టమైన ప్రాంతంలోనే శస్త్ర చికిత్స చేయాలి. అప్పటికి అత్యాధునిక లేజర్ చికిత్సలు లేవు. ముగ్గురు మనుషులను సూక్ష్మ మానవులుగా మార్చి, ఒక సిరంజి ద్వారా వారిని రోగి శరీరంలో ప్రవేశపెట్టి శస్త్రచికిత్స పూర్తి చేయించడం ఈ చిత్రంలో ప్రధానాంశం. గగుర్పాటు కలిగించే అధివాస్తవికత ప్రారంభమైంది కూడా ఈ చిత్రంతోనే.

దీర్ఘ కాలంపాటు కొనసాగిన అస్పష్ట, అధివాస్తవిక సైన్స్ ఫిక్షన్ చిత్రాలకు అడ్డుకట్టవేసిన చిత్రం "క్లోజ్ ఎన్‌కౌంటర్స్ ఆఫ్ ది థర్డ్ కైండ్". గ్రహాంతరవాసుల భూలోక యాత్ర ఈ చిత్రం నేపథ్యం.

విజ్ఞాన శాస్త్రంలో ఇప్పటివరకు "కొరకరాని కొయ్య"గా మిగిలిపోయినవి 'ఎగిరే పళ్లాలు'! వీటినే యూ. ఎఫ్. ఒ. (Unidentified Flying Objects) అంటారు. సుదూర గ్రహాల నుంచి గ్రహాంతర యాత్రికులు ఈ ఎగిరే పళ్లాల సహాయంతో వచ్చిపోతున్నారన్నది కొందరి భావన. అద్భుతమైన, ప్రకాశవంతమైన

కాంతులు విరజిమ్ముతూ, అనూహ్యమైన వేగంతో ప్రయాణిస్తున్న యు.ఎఫ్.ఓ. లను కొందరు చూసినట్లు ఇప్పటికీ పత్రికలలో వార్తలు వస్తుంటాయి. అవి నిజంగా గ్రహాంతర యాత్రికుల వాహనాలేనా అన్న వివాదాస్పద విషయాన్ని ప్రస్తుతానికి అటుంచితే, గ్రహాంతర వాసులంటూ ఉంటే వాళ్లు కచ్చితంగా మనకంటే ఉన్నత నాగరికతను సాధించిన వాళ్ళే అయ్యుంటారని శాస్త్రజ్ఞులు చాలా మంది విశ్వసిస్తున్నారు. వాళ్ళంటూ ఉంటే వాళ్ళకి తిండికంటే ఆలోచనలే ముఖ్య మని కూడా చాలా మంది భావిస్తున్నారు.

అసలు "గ్రహాంతరవాసులు" అంటూ వుంటే వాళ్ళ రూపురేఖలు ఎలా ఉంటాయి; నాగరికత ఎలా ఉంటుంది; వాళ్ళ సాధించిన విజ్ఞానం ఎంతో ఉన్నత మైనది మొదలైన ఆసక్తిదాయకమైన అంశాల గురించి ఇప్పటికి చాలా సాహిత్యం వచ్చింది.

ఎరిక్ వాన్ డానికన్ అనే ఆయనైతే ప్రపంచం నలుమూలలా పర్యటించి, అనేక అద్భుత నిర్మాణాల గురించి వివరాలు సేకరించి మానవశక్తికి అతీతమైన కట్టడాలకు, ఇంజనీరింగ్ విజ్ఞానానికి గ్రహాంతర యాత్రికులే కారణమని "చారియట్ ఆఫ్ గాడ్స్", "రిటర్న్ టు ది స్టార్స్" మొదలైన రచనలలో తేల్చేశాడు. గ్రహాంతరవాసులు ఏదో ఒక సందర్భంలో భూగ్రహాన్ని సందర్శించి వెళ్ళారన్నది ఆయన వాదన.

గ్రహాంతరవాసులు నిజంగా ఉన్నారా, లేదా, భూగ్రహాన్ని సందర్శించారా, లేదా అన్న వివాదం సంగతి అటుంచితే, ఇతర గ్రహాలపై "బుద్ధిజీవులు" వున్నాయన్న వూహ ఆధునిక విజ్ఞానశాస్త్ర పరిశోధనల దిశనే మార్చేసింది. శాస్త్రజ్ఞులలోనే కాదు, సామాన్యులలో కూడా ఈ వూహ గొప్ప జిజ్ఞాసను కలిగించింది. గ్రహాంతర వాసుల ఉనికిని కనిపెట్టే లక్ష్యంతో, రేడియో సందేశాలను ఎప్పటికప్పుడు భూమికి పంపే ఏర్పాట్లు చేసి అమెరికా దశాబ్దం క్రితం ప్రయోగించిన "పయొనీర్" అనే వ్యోమ నౌక తన అనంత విశ్వయాత్రలో విశ్వరహస్యాలను ఛేదిస్తూ ముందుకు పోతోంది.

ఇటువంటి పరిశోధనల నేపథ్యంలో "క్లోజ్ ఎన్‌కౌంటర్స్ ఆఫ్ ది థర్డ్ కైండ్" వచ్చింది. ఈ చిత్రం ఒక స్థాయి ప్రేక్షకులను సైతం ఉర్రూత లూగిం

చింది! పెద్ద తలకాయ, చిన్న పొట్టతో భూగ్రహానికి వచ్చిన ఆ గ్రహాంతర యాత్రికుడు మహోన్నత నాగరికతకు, అనిర్వచనీయమైన నిర్మలత్వానికి, అపారమైన విజ్ఞానానికీ ప్రతినిధిగా మన ముందు నిల్చుంటాడు.

సైన్స్ ఫిక్షన్ చిత్రాలకు కొత్త ఒరవడి పెట్టిన "క్లోజ్ ఎన్‌కౌంటర్స్ ఆఫ్ ది థర్డ్ కైండ్" ప్రపంచ వ్యాప్తంగా ప్రేక్షకులపై చెరగని ముద్ర వేసింది.

తర్వాత కాలంలో ఈ చిత్రం నుంచే రూపు దిద్దుకున్న "స్టార్ వార్స్" చిత్రం గ్రహాల మధ్య అమానుష యుద్ధోన్మాదాన్ని ఆవిష్కరించింది. గ్రహాంతర వాసుల కోసం అన్వేషణలో ప్రారంభమైన మానవ జిజ్ఞాసను ఉన్మాద స్థితికి తీసుకు వెళ్ళిన ఘనత ఈ చిత్రానిదే. రాజకీయంగా 'సాల్ట్' చర్చలు అటు మునగాలేక, ఇటు తేలాలేక కొట్టు మిట్టాడుతున్న దశలో అమెరికా తన "రక్షణ" పేర అమెరికా ప్రజల అభిమతానికి వ్యతిరేకంగా, కోట్లాది డాలర్ల ఖర్చుతో ఏకంగా "స్టార్ వార్స్" అనే వ్యూహాన్ని సిద్ధం చేయడం యాదృచ్ఛికం కాదు. హాలీవుడ్ నుంచే రాజకీయాల లోకి వచ్చిన కౌబాయ్ నటుడు రీగన్ హయాంలోనే అదే హాలీవుడ్ సిద్ధం చేసిన వ్యూహాన్ని మొత్తం అమెరికా పాలనా యంత్రాంగం పుణికి పుచ్చుకోవడం అంత కంటే కాకతాళీయం కాదు !

"2001 : ఎ స్పేస్ ఒడిస్సీ" కి, "స్టార్ వార్స్" మార్కు చిత్రాలకూ మధ్య సైన్స్ ఫిక్షన్ చిత్రాలు అనేకానేక వింత పోకడలు పోయాయి. ఫలితంగా తలా తోకా లేని అనేక చిత్రాలు వచ్చాయి. ఏదో ఒక రకం పైత్యానికి ప్రతీకలుగా వచ్చిన చిత్రాలు కూడా వీటిలో ఉన్నాయి.

శాస్త్రజ్ఞులు 'క్లెయిర్ వాయెన్స్' అని పిలిచే లక్షణం ప్రాతిపదికగా "ఐస్ ఆఫ్ లారామార్స్" అనే ఒక చిత్రం వచ్చింది. భవిష్యత్తులో జరగబోయే కొన్ని సంఘటనలు లారామార్స్ అనే ఒక యువతికి ఎప్పటికప్పుడు అప్రయత్నంగా తెలిసిపోతుంటాయి. ఈ కోవకు చెందిన చిత్రాలు చాలానే వచ్చాయి. అవన్నీ ఉబుసుపోని చిత్రాలే !

చుట్టు ప్రక్కల జరిగే అన్యాయాలను ప్రతిఘటించడానికి సూపర్ హీరోలు తయారైనట్లే సైన్స్ ఫిక్షన్ చిత్రాలలో 'సూపర్ మ్యాన్' లు తయారయ్యారు. అట్లా వచ్చిన వాటిలో అత్యంత ప్రాచుర్యం పొందిన తొలినాటి చిత్రం "ఫెంటాస్టిక్

3 సూపర్ మెన్"; మలి చిత్రం "బ్యాట్‌మ్యాన్". ఈ మధ్యలో "సూపర్ మ్యాన్" సిరీస్ చాలా వచ్చాయి.

విజ్ఞాన శాస్త్రం కొత్తగా కనిపెడుతున్న రకరకాల పరికరాలు ఉపయోగించి "సామాజిక న్యాయం" కోసం యత్నించిన పాత్రలు "ఫెంటాస్టిక్ 3 సూపర్ మెన్" లో కనిపిస్తాయి. లేజర్ కిరణాలు, అయస్కాంత శక్తి మనిషిని పోలిన మనుషుల వింత సృష్టి—ఇట్లా రక రకాల 'థ్రిల్స్' ఇటువంటి చిత్రాలకు మూస పోసిన ఫార్ములాలు. "ఫెంటాస్టిక్ 3 సూపర్ మెన్" లో ముగ్గురు హీరోలు చేసే పనులను ఒక్క హీరోయే చేసే చిత్రం "సూపర్ మ్యాన్". హాలీవుడ్ దర్శకుల పైత్య ప్రకోపానికి పరాకాష్ట విలన్ తరహా హీరో "బ్యాట్‌మ్యాన్" !

ఇవి ఒక రకంగా కేవలం సైన్స్ ఫిక్షన్‌లు కావు-సోషల్ సైన్స్ ఫిక్షన్‌లు! సమాజం ఎదుర్కొంటున్న రకరకాల సమస్యలు వీటిలో కనిపిస్తాయి. కాని వాటిని పరిష్కరించేది మాత్రం మానవాతీత పాత్రలు. ఆ పాత్రలకు అతీత శక్తిని ప్రసాదించేది సైన్స్. ఈ తరహా చిత్రాలలో అంతర్లీనంగా కనిపించే తాత్వికత ఏమంటే మానవుని మానవాతీత మానవునిగా ఆవిష్కరించడం! ఇది సైన్స్ ముసుగులో జరుగుతున్న కుట్ర తప్ప మరొకటి కాదు.

తొలినాటి సైన్స్ ఫిక్షన్ చిత్రాలకు, వర్తమాన సైన్స్ ఫిక్షన్ చిత్రాలకూ ప్రధాన వ్యత్యాసం అవి ప్రచారం చేస్తున్న విలువలలోనే ఉంది. సామాజిక వికాసానికి, వైజ్ఞానిక ప్రగతికీ మధ్య విడదీయరాని సంబంధం ఉందన్న వాస్తవాన్ని గుర్తించిన వారే తొలినాటి సైన్స్ ఫిక్షన్ చిత్రాలు నిర్మించారు; తాము నిర్మించిన చిత్రాల ద్వారా వారు విజ్ఞాన శాస్త్రాన్ని జన సామాన్యానికి దగ్గరగా తీసుకు వెళ్ళడానికి యత్నించారు. పైగా ఇవ్వాళ కాకపోతే రేపైనా ఇది సాధ్యమేననే వాస్తవిక దృష్టి, సాధ్యం కావాలనే తపన ఆనాటి చిత్రాలలో అంతర్లీనంగానైనా కనిపించేది. వర్తమాన సైన్స్ ఫిక్షన్ చిత్రాలలో కొరవడింది ఈ లక్షణమే.

"క్లోజ్ ఎన్‌కౌంటర్స్...." తర్వాత "ఇ. టి." (Extra-Terrestrial), "ఏలియన్" సిరీస్ చిత్రాలు వచ్చాయి. ఇవి స్పెషల్ ఎఫెక్ట్స్‌తో చేసిన హడావుడి అంతా యింతా కాదు. చెవులు పగిలిపోయే శబ్దాలు, వళ్ళు గగుర్పొడిచే సన్నివేశాలు,

భీతావహ దృశ్యాలు, మరుక్షణంలో ఏమవుతుందోనన్న డిటెక్టివ్ తరహా ఉత్కంఠ, కేకలు, పెడబొబ్బలు, చావులూ.... ఇత్యాదులు ఆ తర్వాత వచ్చిన సైన్స్ ఫిక్షన్ చిత్రాలకు దినుసులయ్యాయి. "క్లోజ్ ఎన్‌కౌంటర్స్...." గ్రహాంతర జీవుల పట్ల ఆసక్తి. రేకెత్తిస్తే, "ఏలియన్" (వయా—"స్టార్‌వార్స్")కు వచ్చేసరికి ఆ ఆసక్తి స్థానే భయానకమైన ఉన్మాదం వచ్చి చేరింది.

మరోవైపున మనుషుల్ని మెషిన్‌లుగా, మెషిన్‌లను మనుషులుగా మార్చే ప్రయత్నాన్ని కూడా సైన్స్ ఫిక్షన్ చిత్రాలు చేశాయి. కంప్యూటర్లు, మర మనుషులూ సంపన్న దేశాలలో తయారవుతుంటే, వాటి ప్రతిఫలనాలుగా సాంస్కృతిక రంగంలోకి "షార్ట్ సర్క్యూట్" వంటి చిత్రాలు వచ్చాయి. కంప్యూటర్ ఆదేశాల ప్రకారం నడుచుకునే మనుషులూ, మనిషిలాగా ప్రవర్తించి, కామవాంఛలు సైతం తీర్చుకోవడానికి యత్నించే మర మనుషులూ దాదాపు ఏక కాలంలో ఆ తర్వాత తెర పైకి వచ్చాయి. క్రమ క్రమంగా ఈ చిత్రాలలో వెగటు పుట్టించే కుహనా వైజ్ఞానికాంశాలు, అమానవాంశాలూ చోటు చేసుకోవడం ప్రారంభమైంది. ఇవి ప్రధానంగా బీభత్సరస ప్రధాన చిత్రాలుగా రూపాంతరం చెందడానికి, అమెరికా యుద్ధోన్మాదం ఖండ ఖండాంతరాలకు వ్యాపించడానికీ మధ్య అనులోమ సంబంధమే కనిపిస్తుంది.

ఈ మధ్యే వచ్చిన "టోటల్ రీకాల్" అనే సైన్స్ ఫిక్షన్ చిత్రం ఇందుకు పరాకాష్ఠ. వచ్చే శతాబ్దంలో మార్స్ పై యుద్ధాలు, తిరుగుబాట్లూ జరగడం, అగ్రహం వాళ్ళకు చాతకాదని భూగ్రహం నుంచి వెళ్ళినవాడే అక్కడ అన్ని అడ్డంకులూ అధిగమించి వీరోచితంగా పోరాడడం, కనికట్టు అనిపించే సైన్స్ వింతలు విడ్డూరాలు.... ఇంకా అనేకానేక భయంకర: బీభత్స చిత్రీకరణలతో ఈ చిత్రాన్ని నింపేశారు.

ఆ గ్రహంపై కనిపించే 'మనుషులకు' ఒక ముక్కుగాని, కాలుగాని, బుద్ధులుగాని తిన్నగా వుండవు: అన్నీ వంకరే! గ్రహాంతర వాసులకు సంబంధించి తొలినాటి వ్యూహాలకు, ఇప్పటి పలాయన వాద చిత్రాలకూ ఎంత తేడా! మనల్ని మించిన తెలివైన వాళ్ళు, చూడ ముచ్చటైన వాళ్ళూ ఈ గ్రహం మీదే కాదు మరో గ్రహంపై సైతం మనగలగడాన్ని వ్యూహాత్మకంగా కూడా ఆమోదించలేని స్థితికి ఇవ్వాళ అమెరికన్ పెట్టుబడి చేరింది. ఆ పెట్టుబడితో పాటు ప్రవహించేదే ఈ ఫాసిస్టు సంస్కృతి.

ఒక 'మనిషి' పొట్టను చీల్చుకుని మరో 'మనిషి' కంగారూ లాగా బయటకు రావడం, శత్రువులకు సంబంధించిన రహస్యాలు చెప్పేయడం, తలలో అమర్చిన ఒక ఎలక్ట్రానిక్ వస్తువును ముక్కులో నుంచి బలవంతంగా బయటకు పీకడం, ఒకే మనిషి నుంచి అటువంటి మనిషినే పోలిన లేజర్ మనుషులు పుట్టుకు రావడం, వాళ్ళు శత్రు గ్రహవాసులను ఆట పట్టించడం, వ్యూహాలలోని మనుషులకు ఆకారాలు రావడం..... ఇత్యాదులన్నీ ఈ చిత్రంలో చూడవచ్చు: రాత్రులకు రాత్రులు నిద్ర లేకుండా వెర్రిగా వీటి గురించే ఆలోచించవచ్చు: సాంస్కృతిక రంగంలో ఆధిపత్యం కోసం సాంకేతిక శాస్త్రం వూతతో సాగుతున్న ఇటువంటి యత్నాల గాలిలో కొట్టుకుపోనూవచ్చు.

స్టార్ సిస్టమ్ ప్రధానంగా నడుస్తున్న సినిమా పరిశ్రమలో సాంస్కృతిక సామ్రాజ్యవాద సైనికులు హీరోలు అయినట్లే సైన్స్ ఫిక్షన్ చిత్రాలలో సాంస్కృతిక ఫాసిస్టు శక్తి పాత్రను పోషిస్తున్నదీ, ఒక జాతి ఆధిపత్యాన్ని రాజకీయ రంగంలో నిలబెడుతున్నదీ సైన్సే! అదే గమ్మత్తు!

---

## కొడవటిగంటి అవార్డు

అల్లం రాజయ్య కథ 'మధ్యవర్తులు' (ఆంధ్రజ్యోతి, దీపావళి సంచిక, 1990) కొడవటిగంటి కుటుంబరావుగారి అవార్డు పొందింది. రాచకొండ విశ్వనాథశాస్త్రి, కాశీపట్నం రామారావుగార్లు ఎంపిక చేశారు.

మద్రాసు
20-4-91

ఇట్లు
కొడవటిగంటి వరూధిని

పుస్తక సమీక్ష :

# గడ్డిపరకతో విప్లవం

రవి

సమాజం "అభివృద్ధి" చెందే కొద్దీ, అసలు అభివృద్ధి అంటే ఏమిటి? అంటూ 'అభివృద్ధి' ప్రాతిపదికనే ప్రశ్నించటం ప్రారంభం అయింది. గత రెండు మూడు దశాబ్దాలుగా స్థానిక సాంకేతిక పరిజ్ఞానం, పర్యావరణం మొదలైన అంశాలు ప్రాముఖ్యత సంతరించుకొనే కొద్దీ, సాంస్కృతిక విప్లవం తర్వాత ఉపరితల అంశాలన్నీ పునర్నిర్వచనాలకు గురవుతున్న క్రమంలో అభివృద్ధిని కూడా పునర్నిర్వచించడం ప్రారంభమయింది. ఒకప్పుడు కళ్ళు బైర్లు కమ్మేంత పెద్ద పెద్ద యంత్రాలుండటమే అభివృద్ధికి సంకేతంగా భావించేవారు. 1917 తర్వాత రష్యాలో కూడా వీటినే అభివృద్ధికి గుర్తుగా భావించారు. ('అభివృద్ధి' వల్ల మానవ సంబంధాలలో మార్పులను పక్కకు పెడితే). భారతదేశంలోనైతే మానవ నిర్మిత జలసాగరాలను ఆధునిక దేవాలయాలుగానే భావించడం జరిగింది.

అయితే "మనం పొందిన ప్రతి విజయానికీ ప్రకృతి మనమీద ప్రతీకారం చేస్తుంది" అనే విషయం మానవుడు మరచిపోయాడు. మరచిపోయాడనే విషయం కూడా సరికాదు. 'అభివృద్ధి'ని ఉత్పత్తి శక్తుల అభివృద్ధిగా ఉత్పత్తి అభివృద్ధిగా మాత్రమే గుర్తించిన ఉత్పత్తి విధానంలోనే ఆ లోపం ఉంది. శ్రమించిన వెన్వెంటనే సరాసరి కలిగే ఫలితాలను పొందాలనుకొనే లక్ష్యం మాత్రమే వున్న ఉత్పత్తి విధానాలు ఉండటమే ఆ లోపం,

ప్రకృతి మీద ప్రతి విజయం మొదటిసారి మనం కావాలనుకున్న ఫలితాలను కలిగిస్తుంది. కానీ రెండవ, మూడవ దఫాలు భిన్నమైన, ముందు చూడబడనటువంటి ఫలితాలను అది కలుగజేసినట్లయితే, అది మొదటి వాటిని తుడిచి పెడతాయి.

గత రెండు మూడు దశాబ్దాలుగా ఈ వ్యతిరేక ఫలితాలు మనిషికి ఎప్పటికన్నా ఎక్కువ స్పష్టం కావటం మొదలయ్యింది. పారిశ్రామిక కాలుష్యం మనుషుల్లో రోగాలను రప్పించింది. రోగాలు నయం చేసుకోవటానికి వాడే మందులు కొత్త రోగాలను సృష్టించాయి. ఆధునిక దేవాలయాలు అనేక లక్షల ఎకరాల అడవిని

మించి వేస్తున్నాయి. లక్షల గిరిజనులను అడవినుండి గెంటివేసి కొత్త సమస్యలను సృష్టిస్తున్నాయి. ఏటా కొన్నివేల ఎకరాలను చవట పర్రులుగా మారుస్తున్నాయి. రసాయనిక ఎరువులు భూమిని నిస్సారంగా మారుస్తుంటే క్రిమిసంహారక మందులు క్రిములకు కాక మనుషులకే హానికరమవుతున్నాయి. ఒక సర్వేలో తేలిందేమిటంటే "హరిత విప్లవం" నుండి నేటి వరకు మన దేశంలో క్రిమిసంహారక మందుల వాడకం పదిరెట్లు పెరగగా క్రిముల సంఖ్య రెండు రెట్లయ్యింది.) ఓజోన్ పొర కరగటం, చెర్నోబిల్ పేలుడు వంటి సంఘటనలు పర్యావరణం గురించి మానవుడు తక్షణం పట్టించుకోవలసిన అవసరాన్ని ముందుకు తెచ్చాయి.

పెరుగుతున్న జనాభాకు అవసరమైన అధిక ఆహారోత్పత్తి సమస్యను తీర్చ డానికి మనదేశంలో 1960 దశాబ్దంలో 'హరిత విప్లవం' ప్రారంభించబడింది. ఐతే మూడు దశాబ్దాల తరువాతకూడ ఆహార కొరత తీరలేదు. దేశంలోని 500 పైగా ఉన్న జిల్లాల్లో 70 జిల్లాలు మాత్రమే అవసరానికు మించి ఉత్పత్తి చేస్తున్నాయి. మిగిలిన జిల్లాల్లో ఉత్పత్తి అవసర స్థాయికంటే చాలా తక్కువగా ఉంది. ఇందుకు ఒక స్థాయిలోని పరిష్కారం వ్యవసాయ విప్లవం. భూమి పునః పంపకం తర్వాత కూడా వ్యవసాయం అభివృద్ధి చేయవలసిన 'పద్ధతి'కి అవలంబించవలసిన సాంకేతిక విధానం ఏమిటన్నది ఈనాటికీ అస్పష్టమే. ఈనాటి సాంకేతిక విధానమంతా పెద్ద ఎత్తున రసాయనిక ఎరువుల వాడకానికి ప్రతిస్పందించే వంగడాల ఉత్పత్తి, అవి క్రిమి కీటకాదుల దాడికి సులభంగా గురి కావటం, సస్యరక్షణకు మళ్ళీ క్రిమిసంహారక మందులపై ఆధారపడటం, ఆ క్రిమి సంహారక మందులు క్రిమి కీటకాలను చంపక పోగా, ప్రమాద స్థాయిల్లో మనుషుల్లో పేరుకుపోవటం. ఉపయోగకరమైన కీటకా లను (సహజ శత్రువులను) చంపివేయటం తత్ఫలితంగా కొత్త రోగాల అభివృద్ధి- ఈ రకంగా సాగుతోంది. సామ్రాజ్య వాదులు తమ స్వప్రయోజనాలకోసం దిగుమతి చేస్తున్న సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉన్నదున్నట్లుగా వాడే విధంగా మన వ్యవసాయ పరిశోధన కొన సాగుతున్నది, కాబట్టి ప్రత్యామ్నాయ విధానాల గురించి ఆలోచించే వాళ్ళమంతా ప్రత్యామ్నాయ సాంకేతిక పరిజ్ఞానాన్ని గురించి కూడా ఆలోచించాలి. అలా కాని నాడు "స్థానిక సాంకేతిక జ్ఞానం" ని అభివృద్ధి చేయలేము.) "స్థానిక సాంకేతిక జ్ఞానం" పెంపొందనప్పుడు సామ్రాజ్యవాదాన్ని శక్తివంతంగా ఎదుర్కొనలేము.

జన చైనాలో 'ఆకు పంక్చర్' లాంటి సాంప్రదాయిక వైద్య విధానాన్ని పునరుద్ధరించటం చేశారు. అంతేకాదు, పేడను, జంతువుల మనుషుల మల మూత్రాలను ఎరువుగా మార్చి వ్యవసాయంలో పెద్ద ఎత్తున వినియోగించటం వల్ల చైనాలో తలసరి నత్రజని వినియోగం ప్రపంచంలో అన్ని దేశాల్లో కంటే కూడా తక్కువగా ఉన్నప్పటికీ అక్కడ భారతదేశంలో కంటే కనీసం మూడు రెట్లు అధిక ఆహార ధాన్యోత్పత్తి ఉంది. గుర్తుంచుకో వలసిన మరో ముఖ్య అంశం ఏమిటంటే మన దేశంతో పోలిస్తే చైనాలో తలసరి వ్యవసాయ యోగ్యమైన భూమి మూడవ వంతు మాత్రమే. అంటే ఉత్పాదకత దాదాపు ఆరురెట్లు. ఇందుకు ప్రధాన కారణం భూ పంపక మైనప్పటికీ, ప్రకృతికి దగ్గరగా ఉండేటటువంటి, అంటే "ప్రకృతి తన ప్రతీకారం తీర్చుకునే" అవకాశాలు తక్కువగా ఉన్నటువంటి సాంకేతిక పరిజ్ఞానాన్ని అవలంబించటం కూడా చాలా బలమైన కారణం. ఎరువుల వాడకం నేలలోని వానపాములను, ఇతర సూక్ష్మజీవులను పెద్ద ఎత్తున చంపుతుంది. ఒకప్పుడు వర్షాకాలంలో పొలం దున్నుతుంటే కుప్పలు తెప్పలుగా వానపాములు కనిపించేవి. ఇప్పుడు చాలా తక్కువగా అగుపిస్తాయి. భూమిని బ్రహ్మాండంగా దున్నే వానపాముల చావు నేల నిర్మాణంలో పెను మార్పులు తీసుకొచ్చి కొత్త సమస్యలకు దారి తీస్తుంది. సేంద్రీయ వ్యవసాయంలో ఇటువంటి దుష్ఫలితాలు అనేకం. అటువంటి దుష్ఫలితాలు వీలైనంత తక్కువగా ఉండే విధంగా వ్యవసాయం కొనసాగాలని రకరకాల ప్రయత్నాలు కొనసాగుతున్నాయి. 'సమగ్ర వ్యవసాయ'మనీ, 'సస్టెయినబుల్ అగ్రికల్చర్,' అనీ రకరకాల వాదనలు ముందు కొస్తున్నాయి. ఈ వాదనలు కూడా అమెరికాలో పుట్టి ముందుకు రావటం విశేషం మాత్రమే కాదు, వ్యవసాయ సాంకేతిక పరిజ్ఞానాన్ని తన గుప్పిట్లో ఉంచుకోవాలనుకునే సామ్రాజ్యవాద కుత్సితం అని కూడా అనిపిస్తుంది.

ఇటువంటి ప్రత్యామ్నాయ విధానంలో సమగ్రమైన పద్ధతి యేదీ ఇంకా అవతరించలేదు. కానీ అటువంటి ఒక అద్భుత ప్రయత్నం జపాన్‌లోని ఒక పంటల తెగుళ్ళ నిపుణుడు చేశాడు. అతను మసనోబు ఫుకుఒకా ఆధునిక వ్యవసాయాన్ని సవాలు చేస్తూ, పొలాన్ని దున్నకుండా, ఎరువులూ పురుగుల మందులూ కలుపు నాశిని మందులూ, యంత్రాలూ లేకుండా వ్యవసాయం చేయసాగాడు. ప్రకృతిని సాధ్యమైనంతగా అనుసరిస్తూ "ఏమీ చెయ్యనవసరం లేని" వ్యవసాయ విధానాన్ని

రూపొందించాడు. తన అనుభవసారాన్నంతా అతను 'ది వన్ స్ట్రా రెవల్యూషన్' అనే పుస్తకంలో వివరించాడు. ఆ పుస్తకాన్ని 'టింబక్టు కలెక్టివ్స్' వారు తెలుగులో "గడ్డిపరకతో విప్లవం" పేరుతో అనువదించారు.

ఫుకుఒకా ప్రతిపాదించిన "ఏమీ చెయ్యనవసరం లేని వ్యవసాయా"న్ని తానే "ప్రకృతి విధానం"గా వర్ణించుకున్నాడు. ఈ విధానానికి నాలుగు ముఖ్య సూత్రాలున్నాయి. ఒకటి దుక్కి చేయవద్దు. రెండు రసాయనిక ఎరువులు గానీ, తయారు చేసిన పెంటపోగు కానీ వాడవద్దు. మూడు కలుపు తియ్యటానికి దున్నవద్దు. కలుపు నాశిని మందులు వాడవద్దు. నాల్గవ సూత్రం పురుగులనూ తెగుళ్ళనూ అదుపు చేయడానికి ఎటువంటి రసాయనాలమీద అధారపడవద్దు. ఈ నాలుగు సూత్రాలు ప్రకృతికి అనుగుణంగా ఉండి, ప్రకృతి తిరిగి కోలుకోవటానికి, సుసంపన్నం కావటానికి తోడ్పడతాయి.

ఈ నాలుగు సూత్రాలను అభివృద్ధి చేయటానికి ఫుకుఒకా ఇరవయ్యేదేళ్ళ పాటు వరి, బార్లీ, రై పంటలు పండించాడు. దుక్కి చేయటంవల్ల నేల భౌతిక గుణాలు దెబ్బతింటాయి. పైగా కొత్త మొండి కలుపు మొక్కలు మొలుచుకు రావచ్చు. నేల నుండి సహజంగా పుట్టుకొచ్చే రకరకాల మొక్కలు చచ్చిపోయాక, అవి కుళ్ళి నేలలోని పోషక పదార్థాలను పెంచటమే కాకుండా, భౌతిక గుణాలను కూడా మెరుగు పరుస్తాయి. కాబట్టి ఎరువులు వాడవద్దు. దున్నటం ఆపివేయడంతో కలుపుమొక్కల రకాలు తగ్గిపోతాయి. ఒకపంట తయారవుతుండగానే రెండవ పంట విత్తనాలు చల్లితే అవి కలుపు కంటే ముందే మొలిచి కలుపు పెద్దగా పుట్టదు. నేలంతా పరుచుకునే తెల్ల క్లోవరును ధాన్యంతో పాటు విత్తితే కలుపును అదుపులో ఉంచుతుంది. కాబట్టి కలుపునాశిని మందులు కానీ, లేక కలుపును అదుపులో వుంచడానికి దున్నటం కానీ చేయకూడదు. 'చీడ' 'పీడలకు' సహజ శత్రువులు ఉంటాయి. అవి చాలాచీడలను అరికడతాయి. మొక్కలను తమ సహజ స్థితిలో పెరగనీయటంతో మొక్కలు ఆరోగ్యవంతంగా పెరిగి చీడలనుండి తట్టుకుంటాయి. కాబట్టి తెగుళ్ళు, పురుగునాశిని మందులు వాడరాదు.

వరి కోసిన తరువాత ఆ గడ్డిని చిందర వందరగా పరచటం, క్లోవరు పెంపకం ఫుకుఒకా ప్రతిపాదించే ప్రకృతి వ్యవసాయంలో చాలా ముఖ్య పాత్రనే నిర్వర్తిస్తాయి. గడ్డి పరవటం వల్ల విత్తనాలు ఎలుకలు, పిట్టల బారినుండి బయటపడతాయి;

కుళ్ళిన గడ్డి నేలను సారవంతం చేస్తుంది. విత్తనాలకు మట్టి పట్టించి చల్లటం ద్వారా కూడా పిట్టల బారినుండి విత్తనాలు రక్షింపబడతాయి.

ఇటువంటి విధానంతో ఫుకు ఒకా తన పొలాల్లో ఆధునిక వ్యవసాయంతో పోటీపడే పంటను పొందగలిగాడు.

పై నాలుగు సూత్రాలను అనుసరించి ఫుకుఒకా పండ్ల తోటలు, కూర గాయల తోటలు కూడా పెంచాడు.

ఎర్రగా, గునపం దిగనంత గట్టిగా ఉండే నేలలో మోరిషిమా తుమ్మను, పచ్చిరొట్ట పైరునూ పెంచి ఏడెనిమిదేళ్ళ పాటు కలుపు మొక్కలను అలాగే వదిలేయడంతో నేల మెత్తగా, నల్లగా, సేంద్రియ పదార్థంతో వానపాములతో సార వంతంగా తయారయ్యింది. ఆ నేలలో పండ్లతోటలు పెంచాడు. కూరగాయలను కూడా ఇటువంటి సహజస్థితిలో పెరగనిచ్చాడు.

ప్రకృతి వ్యవసాయంలో మరొక అతి ముఖ్యమైన అంశం ప్రకృతిలో సహజంగా విభిన్న కాలాల్లో లభించే అన్ని రకాల ఆహారం సరిగ్గా వినియోగించు కోవాలనేది. ఈ విషయం గురించి రాయటానికి ఫుకుఒకా ఒక అధ్యాయాన్నే కేటాయించాడు. ప్రకృతి ఆహారాన్ని వివరిస్తూ రెండు బొమ్మలు గీశాడు. మొదటి దానిలో ఆహార పదార్థాలన్నీ పండ్లు, కూరగాయలు, సముద్ర ఆహారం వంటి విభిన్న సమూహాల్లో ఉన్నాయి. ఏ నెలలో ఏ విధమయిన ఆహారం దొరుకుతుందో రెండవ దానిలో చూపించాడు. మిల్లుల్లో తయారైన పళ్ళు తినవద్దని అంటాడు. అంటే- కృత్రిమంగా మగ్గబెట్టి, రంగులు రావటానికి నిగ నిగ లాడటానికి రంగులు పూసి, పారాఫిన్ ఆయిల్‌ను వాడిన పళ్ళను తినవద్దని, దంపుడు బియ్యం వంటి ఆరోగ్య వంతమైన ఆహారాన్ని వాడాలిగానీ రుచి అనో, ఒకే రకమైన ఆకారం రంగులో ఉండే పళ్ళు, కూరగాయల పట్ల ఎక్కువ మోజు చూపటమో చేసి బలహీనమైన తిండి తిని రోగాలు కొనితెచ్చుకోవద్దని మనకు చెబుతాడు.

ఈ రకంగా ప్రకృతికి అతి దగ్గరగా ఉండేటటువంటి ప్రకృతితో మమేకమ య్యేటటువంటి విధానాలనెన్నింటినో ఫుకుఒకా వివరించాడు.

పురుగుల మందులు వాడినప్పుడు దిగుబడులు తగ్గిన సందర్భాలను చాలా అరుదుగా ప్రకటించి, మందులు తయారుచేసే కంపెనీలు ఇచ్చే ప్రకటనల్లో ఏదో కప్పిపుచ్చే ప్రయత్నం చేస్తున్నాయని అనుమానిస్తాడు.

తన పద్ధతులు ఆచరణలో రావటానికి ఎవరు అడ్డంకి అనే విషయం ఎక్కడ అనుమానించాలో అక్కడే సరిగ్గా అనుమానించి విమర్శించాడు. వ్యాపార సరళి వ్యవసాయం స్థానే ప్రకృతి వ్యవసాయం ఆచరణలోకి వచ్చి వ్యవసాయం ఒక జీవన విధానం కావాలని ఫుకుఒకా అంటాడు. వ్యాపార సరళి వ్యవసాయం రైతును ఒక యంత్రంలా చేసి రైతు ఒక కవిత అల్లడానికి, పాట రాయడానికి తీరికలేకుండా పోయిందని ఆవేదన చెందుతాడు. లాభాల గురించి ఆలోచించకుండా తనకు కావలసిన ఆహారం పండించకుంటే రైతు పరిస్థితి ఎంతో మెరుగ్గా ఉంటుందని ఆశిస్తాడు.

ఫుకుఒకా నేటి వ్యవసాయ శాస్త్రజ్ఞుల్ని, వారి పద్ధతులనూ, వారి పరిశోధనలనూ, పరిశోధనా ఫలితాలను నిశితంగా విమర్శిస్తాడు. ఆధునిక "శాస్త్రీయ" విధానానికి ఒక దృక్పథం అంటూ లేదు. గుడ్డెద్దు చేనులోపడ్డట్టు పరిశోధనలు చేస్తారు. "ఆధునిక పరిశోధన" ప్రకృతిని చిన్నచిన్న ముక్కలుగా చేసి ప్రయోగాలు చేస్తుంది. ఇవి ప్రకృతి సిద్ధాంతాలకు అనుగుణంగా ఉండవు. రైతు సమస్యలతో పొంతిన ఉండదు. ప్రయోగ ఫలితాలు కూడా రైతు అవసరాలకు అనుగుణంగా కాక పరిశోధనలకు అనువుగా అమర్చి ఉంటాయి. ఈ ఫలితాలను అమలు చేయవచ్చుననుకుంటే పొరపాటే అవుతుంది అని అంటాడు. ఎహైమ్ విశ్వవిద్యాలయంలోని ఆచార్య త్సుహో వ్యవసాయం గురించి ఒక లావుపాటి గ్రంథం రాశాడు. అతను ఫుకుఒకాతో మాట్లాడుతూ "నా పని పరిశోధనల వరకే ఆచరణ నీకు వదిలేస్తున్నాను" అన్నాడు. "నీ సిద్ధాంతానికీ, వాస్తవ దిగుబడులకూ మధ్య సంబంధం ఉందా ?" అని అడిగితే "ఆ ఒక్కటి మాత్రం అడగకు" అన్న జవాబు!

"పెట్టుబడి" వ్యవసాయ రంగ ప్రవేశం చేసి వందల సంవత్సరాలుగా రైతుల అనుభవంలోనుండి సంపాదించిన జ్ఞానాన్ని తోసిరాజని, మందుల కంపెనీల్లో తనను తాను వృద్ధిచేసుకోవటానికి వ్యవసాయాన్ని వ్యాపారీకరణ చేసి, కాలుష్యాన్ని విశ్వ వ్యాపితం చేసి, రైతును పరాయీకరణకు గురిచేసి, శాస్త్రీయ పరిశోధనల పేరుతో "అశాస్త్రీయ" పరిశోధనలను పెంచి పోషిస్తున్నందుకు ఫుకొఒకా ఆందోళన చెందడం చాలా అభినందనీయం. దానిని తిట్టుకుంటూ నాల్గుగోడల మధ్య ప్రయోగశాలల్లోనే మగ్గకుండా ఆచరణాత్మకంగా ఒక ప్రత్యామ్నాయ (ఇందులో ఉన్న లోపాలను ఆ తర్వాత వివరిస్తాను) విధానాన్ని ప్రతిపాదించ పూనుకోవటం ఈనాటి మన శాస్త్ర

జ్ఞులకు ఆదర్శప్రాయమైన విషయం. పొలంలో చేల మధ్య కాక, లైబ్రరీలలో, ఎయిర్ కండిషన్డ్ లాబొరేటరీలల్లో చొక్కా నలగకుండా, చేతులకు మట్టి అంటకుండా "ప్రతిభావంతంగా" వ్యవసాయ పరిశోధన చేస్తున్న శాస్త్రవేత్తలు తామెంత హాస్యాస్పదమైన ప్రహసనాన్ని కొనసాగిస్తున్నారో అర్థం చేసుకోవలసి ఉంది. శాస్త్రీయమైన పద్ధతికి (ఫుకుఒకాకి ఈ మాటపట్ల అభ్యంతరం ఉండవచ్చుగాక) ఫుకుఒకా ఎంచుకున్న విధానం ఒక సజీవ తార్కాణం. అంటే "సమాచారం" జ్ఞానంగా రూపుదిద్దుకోవటం ఆచరణ ద్వారా మాత్రమే సాధ్యమనేది మనదేశ వ్యవసాయ శాస్త్రజ్ఞులు ఫుకుఒకా నుండి నేర్చుకోవలసి ఉంది. "మానవ లక్ష్యం ఏమిటి? మానవాళి ఏమి సృష్టించాలి?" అని శాస్త్రవేత్తలు తమను తాము ప్రశ్నించుకోవాలి అని ఫుకుఒకా చెప్పిన విషయం పట్టించుకోకుండా "గుడ్డెద్దుచేలో పడ్డట్టు", సమగ్రంగా కాకుండా ముక్కలు ముక్కలు చేసే" పరిశోధనలు చేసి అనుద్దేశ్య పూర్వకంగానైనా సరే బహుళజాతి కంపెనీల ప్రయోజనాలు నెరవేర్చటం క్షమించరాని నేరం

ఫుకుఒకా రూపొందించిన యాజమాన్య పద్ధతులు (ఆ పదం పట్లనే ఫుకుఒకాకి వ్యతిరేకత ఉంది. తన పద్ధతిని ప్రకృతికి అతి దగ్గరగా ఉండే వ్యవసాయంగా, "విచక్షణారహితజ్ఞానం" ద్వారా రూపొందించిన పద్ధతిగా, ప్రకృతిలో జోక్యం చేసుకోకూడని పద్ధతిగా ప్రకటిస్తున్నాడు. కాబట్టి ఆయన దృష్టికోణం నుండి ఆ పద ప్రయోగమూ, అలా అర్థం చేసుకోవటమూ రెండూ తప్పే. కానీ, అందులో ఉన్న లోపాలనూ, వైరుధ్యాలను నేను చర్చించదలచాను కాబట్టి, నా దృష్టిలో వాటిని యాజమాన్య పద్ధతులనడమే సబబు. అప్పుడే వాటిని వ్యవసాయంలో ఉపయోగించు కోగలుగుతాం) ఎన్నో ఆచరణయోగ్యమైనవి. సహజ శత్రువులను చంపకపోవటం, రసాయనిక ఎరువులు వాడకపోవటం, సహజమైన ఆహారం తీసుకోవటం (అంటే మిల్లుల్లో తయారైన పళ్ళు, పిప్పిగా మారిన బియ్యం వాడటం, అకాలమైన పళ్ళ కోసం వెంపర్లాట మానటం) నిర్ద్వంద్వంగా ఆచరించవలసిన అంశాలు. "హరిత విప్లవం" రసాయనాలకు, అధిక ఎరువులకు మాత్రమే ప్రతిస్పందించే వంగడాలను సృష్టించడం వల్ల, కుట్రపూరితంగా రోగాలకూ, చీడలకూ గురయ్యే వంగడాలను అభివృద్ధి పరచటం వల్ల ఇంత పెద్ద ఎత్తున రసాయనాలు వాడవలసి వస్తున్నది. అయితే, రోగ నిరోధక శక్తి ఉండే వంగడాలు అభివృద్ధి చేసి, ప్రకృతి సహజ సారాన్ని పెంపొందే ప్రక్రియలు చేపట్టటం ద్వారా ఈ వాడకాన్ని బహుశా నిరోధించ

వచ్చు. చీడలు అంటినా, సహజ శతృవులకు హాని కలిగించని వేప గానుగ పిండి, పొగాకు రసం వంటి పదార్థాలు వాడి, సహజ శతృవులను విరివిగా పెంపొందించి పొలాల్లో వదిలి అదుపు చేయవచ్చు. ఈ పద్ధతులన్నీ ఫుకుఒకాయే చెప్పినట్టు ఆయా దేశ, ప్రాంత పరిస్థితులకు అనుగుణంగా రూపొందించుకోవాలి. కాబట్టి ఆయా పద్ధతులమీద నిర్దిష్టంగా విమర్శలకు పూనుకోవటం కాక ఫుకుఒకా ప్రతిపాదిస్తున్న విధానానికి భూమిక, ప్రాతిపదిక అయిన అతని దృక్పథంలో ఉన్న వైరుధ్యాలను, లోపాలను చర్చిస్తాను.

విచక్షణా జ్ఞానంతో పొందిన జ్ఞాన మేదీజ్ఞానం కాదు, అది వ్యవసాయంలో ఉపయోగించకూడదు అని ఫుకుఒకా అంటాడు. అందుకే "ఏమీ చెయ్యనవసరం లేని వ్యవసాయా"న్ని ప్రతిపాదించాడు. రసాయనాలు ఉపయోగించవద్దు అన్నంతవరకు కాలుష్యం దృష్ట్యా అంగీకరించవచ్చు. కానీ సహజ శతృవులను కూడా విడిగా పెంచవద్దు అంటాడు. కుళ్ళిన పెంటను వాడవద్దంటాడు. వీటన్నింటికంటే పైగా "దుక్కి దున్నవద్దు" అంటాడు. రైతు ప్రకృతికి సేవచేస్తే చాలు, ప్రకృతి వరాలనిస్తుంది అంటాడు. స్థూలంగా చెప్పాలంటే ప్రకృతితో పూర్తి స్థాయి ఐక్యతే తప్ప ఘర్షణ అసలే కూడదంటాడు. ఇక్కడ వస్తుంది అసలు పేచీ. ఈ దృక్పథం ఉండటం వల్లనే పై నాలుగు సూత్రాల నిర్ధారణకు రాగలిగాడు. ఈ దృక్పథం అంతులేని వైరుధ్యాల నిలయం. శాస్త్రీయ జ్ఞానంలోని అశాస్త్రీయమైన అంశాలను కాక శాస్త్ర పరిజ్ఞానాన్ని మొత్తంగానే పరిహసించి శాస్త్రీయ సత్యాన్ని ఎన్నటికీ అసలయిన సత్యాన్ని చేరలేవు అంటాడు. ప్రకృతిని ఎంత శోధించినా, ఎన్ని పరిశోధనలు చేసినా చివరకు అది అంతుపట్టని అద్భుతమన్న నిర్ణయానికి శాస్త్రజ్ఞులు రాక తప్పదనే నిర్ణయానికి వచ్చాడు.

ప్రకృతిలో జోక్యం చేసుకోకూడదు, అంటే 'ప్రకృతికి సేవ చేయడం అనేది కూడా అర్థంలేని వాదన అవుతుంది. అప్పుడు ప్రకృతిని ఉన్నదున్నట్టుగా స్వీకరించటం మాత్రమే చేయాలి. అంటే అచ్చంగా జంతువుల్లా జీవించాలి. పసిపిల్లలు ఎంత ఆనందంతో ఉంటారో, పెద్దలయ్యాక అంత ఆనందంగా ఉండకపోవటానికి కోరికలే కారణమన్న నిర్ధారణలో ఈవిషయమే దాగి ఉంది. పసిపిల్లలకు జంతువులకు తేడా యేమీ లేదు. అలాగే ఉండాలని ప్రతిపాదిస్తే అది వేరే చర్చ, కానీ ఫుకుఒకా తను చెప్పిన దానికి విరుద్ధంగా మరోచోట చెబుతాడు. అతని ఆచరణలో కూడా

ఈ వైరుధ్యాన్ని చూడవచ్చు. విత్తనాలు చల్లటం, క్లోవరును పెంచటం ఇవన్నీ ప్రకృతిలో జోక్యమే. పైగా పంటలు కోయడానికి కొడవళ్ళు కావాలి. నూర్చడానికి ఇతర సాధనాలు కావాలి. అవి తయారు చెయ్యాలంటే మరికొన్ని పరికరాలు కావాలి. ఇలా ఒకదానితో ఒకటి లంకెను కలిగియున్నాయి. పైగా ఫుకు ఒకా— "ఉద్దేశ్య రహిత చర్యల గురించీ, పద్ధతి లేకపోవటం గురించీ మాట్లాడినప్పటికీ రోజు వారీ చర్యల ద్వారా ఉత్పన్నమై తరతరాలుగా వస్తున్న విజ్ఞతను అంగీకరించాలి. ప్రకృతి నుంచి నేరుగా మానవుడు చేసిన మొట్టమొదటి నిప్పు, ఉప్పుల ఉపయోగాన్ని కొందరు విమర్శించవచ్చు. ఆదిమ ప్రజలు అలవరచుకొన్న సహజ విజ్ఞతగా భావించి ప్రకృతి ప్రసాదంగా వాటిని అంగీకరించాలి." అని నిప్పు, ఉప్పుల వాడకాన్ని సమర్థిస్తాడు. కానీ అవి ప్రకృతి ప్రసాదించిన వరాలు కావు. అవి మానవుడు శ్రమ, మేధ ద్వారా, వేల వేల సంవత్సరాల ఆచరణ ద్వారా ప్రకృతి నుండి గ్రహించి, ఘర్షించి నేర్చుకున్న విషయాలు-ప్రకృతిలో మిగతా జంతువుల వలె నిర్లిప్త భాగ స్వామ్యం ద్వారా రాలేదు. "పురోగమనం" "అభివృద్ధి" అనే పదాలకు అర్థమే లేదంటున్న ఫుకుఒకా ఆ "అభికృద్ధి" ఫలాల్లో కొన్నింటిని మాత్రం కావాలంటు న్నాడు. ఆయన దుస్తులు, కంటి జోళ్ళు వంటి వస్తువులా, చేపలు పట్టడానికి అవసరమైన పడవలూ, వలలూ, గాలాలూ మొదలైనవి శ్రమ ఫలితం. అంటే ప్రకృతితో ఘర్షణ ఫలితం. రైతులకు కవిత్వం అల్లడానికి, పాటలు పాడటానికి తీరిక లేదని ఆవేదన చెందిన ఫుకుఒకా ఆ కవిత్వం, పాటలు— మానవుడు ప్రకృతితో ఘర్షించి, సామాజిక అభివృద్ధి కావించగా వచ్చిన సామాజిక ఫలితమని గ్రహించలేకపోయాడు.

ప్రకృతితో మానవుడికి ఐక్యతే తప్ప ఘర్షణ ఉండకూడదన్న భూస్వామ్య ప్రాపంచిక దృక్పథాన్ని కలిగి యున్నాడు కాబట్టే కాలుష్యం వంటి సమస్యను, పెట్టుబడి రైతులలో తీసుకువస్తున్న పరాయీకరణను సరిగానే గుర్తించినా దానికి కారణాలను వెతకటంలో మాత్రం విఫలమయ్యాడు. "కోరికల తీవ్రత కారణంగా ప్రపంచం ప్రస్తుత ఈ స్థితిలో ఉంది" అనే నిర్ధారణకు వచ్చి కోరికలను నిర్జించాలన్న బుద్ధుడి ముగింపుకు వచ్చాడు. 'ప్రకృతి ప్రతీకారం తీర్చుకుంటుందని' వెరచి "ప్రకృతి శాస్త్రాలు నూతనంగా అందిస్తున్న విజ్ఞానంతో మన ఉత్పత్తి చర్యల దీర్ఘ కాలిక ఫలితాలను అర్థం చేసుకొని వాటిని అదుపులో పెట్టే" బదులుగా ప్రకృ

తితో ఘర్షణే వద్దు అనే తప్పుడు నిర్ణయానికి వచ్చాడు. ఈ ప్రాపంచిక దృక్పథం వల్లనే - ఇదివరకే శ్రమ, ప్రకృతితో ఘర్షణ ఫలితంగా వచ్చిన అభివృద్ధిలోని కొన్ని అంశాలు (నిప్పు, ఉప్పు, కొడవళ్ళు, నూర్పిళ్ళ సాధనాలు మొదలైనవి) ఉండాలని కోరుకొని వాటిని ప్రకృతి ప్రసాదాలుగా చిత్రీకరించి అంగీకరిస్తున్నాడు. అదే సమయంలో కౌలుషాన్ని పెంచే పద్ధతుల్ని నిరాకరిస్తున్నాడు. అంటే "ప్రకృతి ప్రతీకారం" అతి తక్కువ స్థాయిలో నెరవేర్చుకునే అభివృద్ధిని తనకు తెలియకుండానే ఆమోదిస్తూనే ప్రకృతికి భిన్నమైనదేదీ తాను ప్రతిపాదించడం లేదని అనవసరంగా గందరగోళ పడుతున్నాడు.

సరిగ్గా ఈ ప్రాపంచిక దృక్పథంలో లోపం వల్లనే "దుక్కి చేయవద్దు" అనే సూత్రంలో లోపం ఉందేమోననిపిస్తుంది. దున్నటంవల్ల నేల భౌతిక గుణాలు దెబ్బతినటం వాస్తవమే ఐనప్పటికీ, ప్రపంచ వ్యాపితంగా, వేల సంవత్సరాల మానవుడి ఆచరణను ప్రశ్నించటానికి ఐదారు ఎకరాల్లో ఇరవై సంవత్సరాల పరిశోధన తక్కువ స్థలం, సమయం. ఆయన ప్రతిపాదించిన ఈ కొత్త "జ్ఞానాన్ని" "జ్ఞానం" మాత్రమే ఖండించగలగాలి కాబట్టి నేను ఖండితంగా అందుకు పూనుకోవటం లేదు. కానీ అడవిని నరకకుండా, అంటే ప్రకృతితో ఘర్షించకుండా వ్యవసాయం పురోగమించేది కాదనే విషయం మాత్రం ఘంటాపథంగా చెప్పవచ్చు.

కాబట్టి ఫుకుఒకా ప్రతిపాదించిన యజమాన్య పద్ధతులను ఒక అద్భుత ప్రాతిపదికగా చేసుకొని పరిశోధనలు సాగించవచ్చు. కానీ అతని ప్రాపంచిక దృక్పథాన్ని తిరస్కరించాలి. ప్రపంచంలోని నేటి ఈ స్థితికి కారణం "కోరికలు" కాదు. "పెట్టుబడి" అని గుర్తించాలి. రద్దు చేయవలసింది కోరికలను కాదు, "పెట్టుబడి"ని.

శాస్త్రజ్ఞులకు మాత్రం ఫుకుఒకా పరిశోధనా పద్ధతి ఆదర్శప్రాయం.

"పరిశోధకులయ్యే ముందు ఎవరయినా సరే తత్వవేత్తలు కావాలి" అన్న ఫుకుఒకా, "తత్వవేత్తలు" అని ఆగిపోయాడు. శ్రీశ్రీ "నువ్వొక సైంటిస్టువి కావాలంటే ముందొక కమ్యూనిస్టువి కావాలి" అన్నాడు. కాబట్టి పరిశోధకులయ్యే ముందు ఎవరైనా సరే, "తత్వవేత్తలు" కావాలి; కానీ భావవాద తత్వవేత్తలు కాక, "గతితార్కిక భౌతికవాద తత్వవేత్తలు" కావాలి. అప్పుడే సమస్యకు సరియైన పరిష్కారం దొరుకుతుంది.

× × × →

## సాహిత్య లేఖలు :

సృజన చేరింది....రావు వ్యాసం అనువదించిన వాళ్ళకు ఆ వ్యాసం అర్థమైనట్లు లేదు. మార్క్సిస్టు మెథడ్‌లో డిఫరెంట్ అబ్‌స్ట్రాక్షన్ లెవల్స్ ఏకకాలంలో నడుస్తుంటాయి. ఎక్కువమంది మన పాఠకులకి అవి ఫాలో కావడం కష్టం. అందుకని అనువాదకులు చొరవ తీసుకొని వాటినన్నింటికి ఒక స్థాయికి (వాళ్ళకు పరిచయమైన స్థాయి) కుదించి వేస్తూ వుంటారు. రంగనాయకమ్మగారి "పెట్టుబడి" అనువాదం అంతా అలానే నడిచింది. ఇప్పుడు ఈ అనువాదమూ అంతే. ఐ ఫీల్ వెరీ సాడ్.

'వసంత గీతం' సమీక్ష చాల బాగుంది. (ఇంతకీ "తొలిసైనిక నవల" అనడం కరెక్టేనా? రెండవ ప్రపంచ యుద్ధం మీద "కొమిల్లా" అనే పేరుతో కాబోలు ఒక నవల చదివినట్లు జ్ఞాపకం. అది చాలా హంటింగ్ నవల. రచయిత అంగర కృష్ణారావు? ఆ యుద్ధం వేరైనా అదీ సైనిక నవలే.) నవల ఫోకస్ ఉద్యమం కావడం వల్ల సమీక్ష ఫోకస్ కూడ ఉద్యమం అయింది. కానీ నవలలో సామాజిక పరివర్తన కూడ బాగా రిఫ్లెక్ట్ అయింది. అది ఆయన అంతగా పట్టించుకున్నట్టులేదు. ఆల్ ఇన్ ఆల్ ఇట్ ఈజ్ యాన్ ఎన్‌రిచింగ్ రివ్యూ, 'నేల తల్లి విముక్తి కోసం'

---

→ చివరగా –

ఇటువంటి మంచి పుస్తకాన్ని తెలుగులోనికి అనువదించాలనుకున్న టింబక్టు కలెక్టివ్స్ వారు, అత్యంత సరళంగా, ఆసక్తికరంగా అనువదించిన సురేశ్ అభినందనీయులు. పర్యావరణ సమస్య ఒక ఉపరితల అంశం. పునాదియైన ఆర్థిక రాజకీయ రంగాల్లో విప్లవాత్మకమైన మార్పు లేనిదే ఉపరితల అంశములో మార్పు ఉండదు. కనీసం ఉపరితల అంశానికి ఆ దృక్కోణం ఉండాలి. లేనినాడు వుపరితల అంశాలెన్నిటి కొరకు పోరాడినా ఫలితముండదు. ఈ విషయాన్ని ప్రచురణ కర్తలు, అనువాదకులు గుర్తిస్తారని ఆశిస్తున్నాను.

(గడ్డిపరకతో విప్లవం-ప్రకృతి వ్యవసాయ పరిచయం- మసనోబు ఫుకుఒకా - టింబక్టు కలెక్టివ్ ప్రచురణ. 200+ XXIV పేజీలు, 1/8 డెమ్మీ, సాదా ప్రతి రు. 30, మేలు ప్రతి రు. 50. ప్రతులకు : టింబక్టు కలెక్టివ్, చెన్న కొత్తపల్లి, అనంతపురం జిల్లా - 515 101

కథా సంకలనం సమీక్ష ఒకటి రెండు మంచి పాయింట్లు చెప్పింది. అయితే అది ఆ పుస్తకానికి సమీక్షకాదు. 'వాల్ పోస్టర్' కథ బాగుంది.

ఒక పాఠకుడు

'వసంతగీతం' సమీక్ష చదివాను. బాగా వచ్చినది. నాకు నచ్చినది. కాని దానిని సైనిక నవల అనడం కొంత ఇబ్బందేమో. ప్రజాసైన్యపు విస్తరణ, నిర్మాణం గురించి చెప్పిన నవలేగాని అందులో ప్రజా కోణం సాంస్కృతికంగా ముందుకు వచ్చింది. రాజకీయంగా గట్టిగా నిలబడింది. సైనికంగా సాధించుకుందీ నవలలో. సైనిక నవల అనేసరికి అందులో ప్రజాకోణం విలువ తక్కువ అవుతుందేమోనని పించింది. గట్టయ్య, గట్టయ్య పడినల దగ్గర నుంచి నవలని చూడకుండ దళం తరపు నుంచి గట్టయ్యను చూసినట్లవుతుంది. అది కొంతవరకు నవలకు అన్యాయం అవుతుందేమో.

ఆర్. ఎస్. రావ్
సంబల్ పూర్

"నేల తల్లి విముక్తి కోసం" కథల పుస్తకంపై సమీక్ష సమీక్షగా ఒక సమగ్రతతో లేదు. ఎంతో చిన్నపుస్తకం "సింగరేణి బతుకులు" (మూడు కథలు) పై ఎంతో పెద్ద సమీక్ష వచ్చింది సృజనలో....

కాగా...."నేలతల్లి విముక్తి కోసం"ని ఏ కోణంతో చూసినా ఇంత చిన్న సమీక్షతో ముగించడం శాస్త్రీయం కాదు. కథా సమీక్ష రూపంలో, విప్లవ విశ్లేషణ, పరిచయందాన్లో భాగంగా ప్రక్రియరూపంగా కథలసమీక్ష, కథకుల స్పర్శ ఉండి వుండ వలసింది. పన్నెండు ఏళ్ళ విప్లవోద్యమ కోణాలు అవి ఈ కథల్లో ప్రతిఫలించిన ప్రతిఫలించలేకపోయిన-తీరు ప్రజల తీరు- సంస్కృతి పన్నెండు ఏళ్ళలో మార్పులకు లోనయిన తీరు/ మార్పులకు లోనుకాని తీరు- ప్రజల సాహిత్య సాంస్కృతిక అవసరాలు ఏ మేరకు తీరుతున్నాయి. మొదలయిన ఎన్నో అంశాల్ని సమగ్రతలో భాగంగా విశ్లేషించి ఉండవలసింది. కథా ప్రక్రియ రూపం నుంచి విప్లవ సారాన్ని చెప్పడానికి, విశ్లేషించడానికి సమీక్ష ఉపయోగపడకపోతే అది మార్క్సిస్టు సమీక్ష అవుతుందా?

## స్వీకారం

* పుట్టుమచ్చ-ఖాదర్ మొహియుద్దీన్, కవిత్వం ప్రచురణలు, 56 పేజీలు, 1/8 డెమీ, పది రూపాయలు
* ఎన్నెల్లో ఎన్నెల - రావిశాస్త్రి, కవిత్వం ప్రచురణలు, 48 పేజీలు, పది రూపాయలు
* మరోవైపు-దేశదేశాల కవిత్వం- అను త్రిపురనేని శ్రీనివాస్, 48 పేజీలు, పది రూపాయలు ఈ మూడు పుస్తకాలూ ప్రతులకు: త్రిపురనేని శ్రీనివాస్, 40-5/6-10, ఇస్లేల్ పేట, విజయవాడ-520 010
* మొగ్గ మిరుగులు-కవితా సంకలనం- ప్రజారస విశాఖ యూనిట్ ప్రచురణ 32 పేజీలు, 1/8 డెమీ, మూడు రూపాయలు, ప్రతులకు ఎన్. ఎన్. శ్రీనివాసరావు, 21, నాగార్జున, గవర్నమెంట్ పాలిటెక్నిక్ హాస్టల్, విశాఖ పట్నం-7

---

ఎన్ని లోపాలున్నా 80-90ల మధ్య వచ్చిన ఒక చారిత్రక కథల సంకలనం ఇది.

కథల్లో స్పష్టం చేయడం వీలుకాని అంశాల్ని సమీక్ష ద్వారా వెలికితీసి చెప్పడం కూడా సమీక్షకుడి బాధ్యత. తద్వారా సమీక్షకు, ఉద్యమానికి, కథకు మధ్య సమన్వయం ఏర్పడుతుంది.

ఆర్. ఎస్. రావు గారు బ్రిటీష్ వలస అయ్యేదాకా ఈ దేశానికి మార్క్సు చరిత్ర ప్రణాళిక వర్తించదు అని చెప్తూ ప్రారంభించింది మళ్ళీ మార్క్సునే అన్వయించడం చేశారు? ఇది వలస మార్క్సిజం పద్ధతి కాదూ! శరద్‌పాటిల్ (సత్య శోధక్ కమ్యూనిస్టుపార్టీ) లా మనదైన పద్ధతిని నిర్మించుకుంటూ రావలసింది ఆర్. ఎస్. రావుగారు తెలిసో తెలియకో భావం ప్రధానం చేశారు. భౌతికత అప్రధానం చేశారు. కాగా ఇది విలువల చర్చగా చేయాల్సి ఉంది.

బి. ఎస్. రాములు

జగిత్యాల

* నాలుగు శతాబ్దాల సాక్షిగా నా మహానగరం- హైద్రాబాద్‌పై కవితలు- నిఖిలేశ్వర్, 72+8 పేజీలు, 1/8 డెమీ, రు. 10, ప్రతులకు నిఖిలేశ్వర్, 2-2-647/185/1/ఎ, శారదానగర్, హైద్రాబాద్ 500013
* బహుముఖం- యార్లగడ్డ రాఘవేంద్రరావు, 60+viii పేజీలు, 1/8 డెమీ పదిరూపాయలు, ప్రతులకు యార్లగడ్డ రాఘవేంద్రరావు, 6-3-596/64/1, వెంకట రమణ కాలనీ, హైద్రాబాద్ 500 004
* చైతన్య కవిత-10, సంపాదకులు: తంగిరాల సుబ్బారావు, ఆర్వీయస్ సుందరం, 52+viii పేజీలు, 1/8 డెమీ, పదిరూపాయలు, ప్రతులకు: చైతన్య కవితా వేదిక, ఆర్-2, జ్ఞానభారతి, బెంగుళూరు యూనివర్శిటీ క్యాంపస్, బెంగుళూరు-560 056
* తుపాకి రాజ్యం- పెరుగుతున్న నిర్బంధంమీద నివేదిక- ఆంధ్రప్రదేశ్ పౌర హక్కుల సంఘం ప్రచురణ, 64 పేజీలు, 1/8 డెమీ, 3 రూపాయలు
* పోలీసు కాల్పులు- చట్టం, ఆచరణ- పౌరహక్కుల సంఘం ప్రచురణ, 48 పేజీలు, 1/8 డెమీ, 3 రూపాయలు
* చిత్తూరు జిల్లాలో ఏనుగుల ప్రభుత్వం- పౌరహక్కుల సంఘం ప్రచురణ, 10 పేజీలు, 1/4 డెమీ, 2 రూపాయలు ఈ మూడు పుస్తకాలు ప్రతులకు: ఎస్. ఎస్. సి. బోస్, డా॥ రామనాథం ఛాంబర్ ఆఫ్ లా, పెద్దిబొట్లవారివీధి, గవర్నరుపేట, విజయవాడ-520 002
* హిందూమత రాజ్యం-కె. బాలగోపాల్, ఫెడరల్ ఇండియా పబ్లికేషన్స్, 8 పేజీలు, 1/8 డెమీ, 2 రూపాయలు, ప్రతులకు: యేలూరి అజిత, సుఫియా కుటీరం, రమణ నగర్, సున్నపు బట్టీల సెంటర్, విజయవాడ 520 010
* దుశ్శాసనాలు-స్త్రీలకు కరువైన న్యాయం మూలం. నందితా హక్సర్, అను, వేమన వసంతలక్ష్మి మానవి ప్రచురణలు, 108 పేజీలు, 1/8 డెమీ, పది రూపాయలు, ప్రతులకు: మానవి ప్రచురణలు 40-5/6-10, ఇబ్రేల్‌పేట, విజయవాడ 520 010
* వ్యక్తి స్వాతంత్ర్యం- సమాజ శ్రేయస్సు- రాచమల్లు రామచంద్రారెడ్డి- వ్యాసాలు, సమీక్షలు, ముందుమాటలు, రేడియో ప్రసంగాలు, రారా స్మారక సమితి ప్రచురణ, 300 పేజీలు, 1/8 డెమీ, 50 రూపాయలు ప్రతులకు, ఆర్. అశోకరెడ్డి, హనుమాన్ నగర్, ప్రొద్దుటూరు, 516 360

* గురజాడ రచనలు- మానవతా వాదం, డా॥ బి. భారతి, సంఘమిత్ర ప్రచురణలు, 180+x పేజీలు, 1/8 డెమీ, రు. 25, ప్రతులకు: ప్రగతి ప్రచురణల హౌస్, మ్యూజియం రోడ్డు, గవర్నర్‌పేట, విజయవాడ 520 002
* భారతదేశ ద్వితీయ స్వాతంత్ర్య సంగ్రామం- డా॥ భూపేంద్రనాథ దత్త, అను ఇంగువ మల్లిఖార్జునశర్మ, మార్క్సిస్టు అధ్యయన వేదిక ప్రచురణ, 152+xii పేజీలు, 1/8 డెమీ, సాదాప్రతి రు. 20, ప్రతులకు: మార్క్సిస్టు అధ్యయన వేదిక, 6-3-1243/116, హైదరాబాద్ 500 482
* మొదట మనం మానవులం, పౌరులం, ఆ తర్వాతే ఉద్యోగులం- ఉద్యోగుల క్రాంతి ప్రసంగపాఠం- వరవరరావు విరసం, అనంతపురం యూనిట్ ప్రచురణ, 16 పేజీలు, 1/8 డెమీ, రెండు రూపాయలు, ప్రతులకు అరాయ 12/17, సాయినగర్, అనంతపురం 515 001

---

→ 3. నలభై రూపాయలకన్న ఎక్కువ విరాళం, సహాయం కూడ సంవత్సర చందాగానే పరిగణిస్తాం.

4. సృజన ప్రచురణలు కూడ వెలువరించడానికి ఇటువంటి ఆర్థిక సహాయం దోహదం చేస్తుందని గమనించండి.

సృజనను గతంలో కూడ ప్రజలే తమకంటికి రెప్పలా కాపాడుకున్నారు. ఒకసారి హెచ్చుసంఖ్యలో చందాలు చేర్పించడం ద్వారా, విరాళాలు సేకరించడం ద్వారా, కొత్తప్రాంతాల్లో ఏజెంట్లను కుదిర్చిపెట్టడం ద్వారా (విప్లవసాహిత్య ఇప్పటికీ పూర్తిగా బూర్జువా కాదుగదా ఫ్యూడల్ పంపిణీ పద్ధతి మీదనే ఆధారపడి వస్తున్నది) ఏజెంట్లు సక్రమంగా బకాయిలు చెల్లిస్తున్నారో లేదో కనుక్కోవడం ద్వారా (కనుక్కొంటే సుప్రసిద్ధ పుస్తక విక్రేతలు మొదలుకొని ఎందరు పేరు బకాయిదారులుగా బయట పడతారో- కడుపుచించుకుంటే కాళ్ళమీద పడ్డట్లు!) సృజన జీవనానికి బాసటగా నిలవవలసివున్నది. సృజనను రక్షించుకునే బాధ్య విప్లవ సాహిత్యోద్యమ సానుభూతిపరులు స్వచ్ఛందంగా స్వీకరించవలసి మరోసారికి మరోసారి మనవి చేస్తున్నాం.

సృజన సంవత్సర చందా రు. 40 విడిప్రతి రు. 4

★ సృజనకు విరివిగా చందాలు సేకరించండి.

★ సృజనను పదికాలాలపాటు నిలిపి ఉంచేందుకు మీ వంతు కర్తవ్యం హించండి.

సహాయం కోరడం. 3) చందాలు, విరాళాలు సరేసరి. సృజనకొక నిధి ఏర్పాటు
డం?

మొదటి రెండు నిర్ణయాలు 90 జనవరి ఇరవయ్యేళ్ళ విరసం సభల
ర్వంగా అనుకున్నట్లుగా నే అమలు చేసాం.

సృజన నిధి సూచన ఒక యూనివర్శిటీ అధ్యాపకుల నుంచి వచ్చింది.
కందరికీ కొత్త స్కేల్స్ వచ్చాయి. వేల రూపాయల అరియర్స్ వస్తున్నాయి.
ఒక్క యూనివర్శిటీ నుంచి ఇరవై వేల రూపాయలు వసూలు చేసి ఇస్తాం.
రలో జీవిత సభ్యులుగా చేరిన వారితో సహా వందమంది దగ్గర తలా వెయ్యి
ాయలు వసూలు చేసి నిధి ఏర్పాటు చేయడం కష్టం కాదన్నారు.

ఈ సూచనను మేమొక మార్క్సిస్ట్ ఆర్థిక శాస్త్రవేత్తతో చర్చించాం.
లకు పత్రిక శాశ్వతంగానూ, లాభాలతోనూ నడుపుతామని హామీ ఇవ్వలేని
నిధి ఆలోచన మంచిదికాదన్నారు. అంతేకాకుండా సంస్థలను, నిర్మాణాలను
సంప్రదాయార్థంలో) నూతన విలువల కోసం భగ్నం చేస్తున్న మనం కొత్త
ర్పే కోసం పోవద్దు అన్నారు. 'సాహితీమిత్రులు'లో కూడా ఒకరిద్దరు మొదటి
బూర్జువా ఆర్థిక నీతికి కూడా వర్తిస్తుందన్నారు.

కనుక ఆ ఆలోచన మానుకున్నాం.

ఇక సృజన కోసం చందాగానీ, విరాళంగానీ వసూలు చేయడం ఇంకే విప్లవ,
ర్వామిక, సాంస్కృతిక కార్యాచరణకు ఏ మాత్రం ఆటంకం కలిగించకూడ
కూడ మా అలిఖిత అవగాహన.

ఫలితంగా నెలనెలా క్రమం తప్పకుండా పత్రిక వెలువరించలేకపోవడమే
ా ఏడాది తిరిగేవరకు పదివేలరూపాయల అప్పయింది. ఇప్పుడు

సృజన పొందుతున్న ప్రతి ఒక్కరూ ఇప్పటికే 90, 91లలో చందాలు
చెల్లించి, రిన్యూ చేసిన వాళ్ళు కాకపోతే కనీసం చందా నలభై రూపాయలు
వెంటనే పంపించండి. ఇష్టం లేకపోతే సృజన పంపించవద్దని రాయండి.

జీవిత సభ్యులకు సృజన జీవితమంతా పంపాలని మా ఆశయం నిజమే కాని
సృజన జీవించాలంటే మీరూ మళ్ళా చందాదారులుగా నమోదు కావలసినదే.
ఇంక సృజనకు జీవిత సభ్యుల పద్ధతి ఉండదు. అందరూ చందాదారులే.
మీరు శాశ్వత చందాదారులుగా ప్రతిసంవత్సరం రిన్యూ చేయగల ఆసక్తి
గలవారని మా విశ్వాసం.

SRJANA Telugu Monthly June 1991
Regd. No. with the Registrar of Newspapers for India 10953/67

# సృజనకు ఆర్థిక, హార్దిక సహకారాన్ని అందించండి !

సృజన ప్రారంభించిన పాతిక సంవత్సరాల క్రితం 'సాహితీమిత్రులు' తామే నెలకు పదిరూపాయల చొప్పున వేసుకొని పత్రిక ఆర్థిక భారాన్ని సగమైనా మోయాలనుకున్నారు. మిగతా సగం చందాదార్ల నుంచి రాకపోతుందా అనుకున్నాం.

ఇటీవల సృజన ఆర్థిక పరిస్థితిని సమీక్షించుకున్నప్పుడు 'సాహితీమిత్రులు' మొదట కనీసం తాము సంవత్సర చందాలు కట్టాలి, ప్రతినెలకు ఏభై మంది కొత్త చందాదార్లను అందరు కలిసిగానీ, ఒక్కొక్కరు ఒక నెల బాధ్యత తీసుకొనిగానీ చేర్పించాలి అని తీర్మానించుకున్నాం.

పది పన్నెండేళ్ళ క్రితం సృజనకు జీవిత సభ్యత్వాలు చేర్పించాం. ఏభై మంది దాకా తలా రెండువందలు యిచ్చారు. ఆ మొత్తం ఫిక్స్‌డ్ డిపాజిట్‌లో పెట్టి దానిపై వచ్చే వడ్డీతో సృజన నిర్వహించాలని లెక్కలు గట్టాం. త్వరలోనే ఏ అంచనాకూ అందకుండా పెరిగిన కాగితం ధర, ప్రింటింగు చార్జీలు, పోస్టల్ రేట్లు ఆ డబ్బు అసలు మొత్తానికి ఎసరుపెట్టాయి.

జీవిత సభ్యత్వం అడుగుతూ ఖమ్మంలో ఒక డాక్టర్ దగ్గరికి వెళ్ళి 'జీవితమంతా సృజన పంపుతాం' అన్నపుడు 'ఎవరి జీవితం ? సృజన బతికినంత కాలం పంపించండి చాలు' అన్నాడు.

అన్నట్లే ఇంతలో 86 లో సృజన ఆగిపోయింది. అయితే సృజన పునః ప్రారంభం కాగానే వీళ్ళకు మళ్ళీ పంపుతూనే వున్నాం.

90 లో సృజన తిరిగి ప్రారంభించేప్పుడు మూడు నిర్ణయాలు తీసుకున్నాం. 1) జీవిత సభ్యత్వాల్లో కొద్దో గొప్పో మిగిలిన డబ్బుతో గద్దర్ 'సాంస్కృతిక ఉద్యమం నిర్మాణ సమస్యలు' ప్రచురించి 'సృజన ప్రచురణలు' పునః ప్రారంభించడం. ← 2) సృజన పునః ప్రారంభ సంచిక అప్పో సప్పో చేసి తెచ్చి తర్వాతగానీ ఆర్థిక

Rs. 4/-

SRJANA
Flat 11, Block 2,
MIG II, Baghlingampalli,
Hyderabad-500 044.